

# గంధర్వ చక్రవర్తి కూతురు

పూర్వం బస్రానగరంలో హసన్ అనే యువకుడుండేవాడు. హసన్ అంటే సౌందర్యమని అర్థం. ఆ పేరు వాడికి సార్థకమయింది. ఎందుకంటే ఆ కాలంలో బస్రానగరంలో హసన్ వంటి సౌందర్యవంతుడు మరొకడు లేడు. వాడు తల్లిదండ్రులకు ఒక్కడే బిడ్డ కావటంచేత కాస్త గారాబంగా పెంచారు. దానికి తగ్గట్టు వాడి తండ్రి వాడి చిన్నతనంలోనే చనిపోయాడు. తరవాత కొద్దికాలంలోనే తండ్రి మిగిల్చిన డబ్బు కాస్తా హసన్ మిత్రులతో విందులు చేసి తగలేశాడు.

ఆ తరవాత వాడి తల్లి తన డబ్బుతో పెద్ద బజారులో ఒక నగలు చేసే దుకాణం కొని పెట్టింది. వాడు రోజూ ఆ దుకాణంలో కూచుని బంగారు నగలు చేస్తూ ఉండేవాడు. వాడి అందం దారే పోయే పిన్నలనూ, పెద్దలనూ ఆకర్షించేది.

ఒకనాడు హసన్ తన దుకాణంలో కూచుని పని చేసుకుంటూండగా ఒక పర్షియాదేశపు వృద్ధుడు, తెల్ల తలపాగా ధరించి, పొడుగాటి తెల్లని గడ్డంతో సహా అటుగా వెళుతూ హసన్‌ను చూసి ఆగిపోయాడు. మనిషి చూస్తే చాలా గౌరవనీయుడిలాగున్నాడు.

ఇంతలో మధ్యాన్నపు ప్రార్థనలకు వేళ అయింది. వీధులన్నీ ఖాళీ అయాయి. వృద్ధుడు హసన్ దుకాణంలోకి అడుగు పెట్టి హసన్‌కు సలాం చేశాడు. హసన్ తిరిగి ఆ వృద్ధుడికి సలాం చేసి ఆయనను కూచోమని మర్యాదచేశాడు.

వృద్ధుడు కూచుని చిరునవ్వు నవ్వుతూ, "నాయనా, నాకు సంతానం లేదు. నిన్ను చూడగానే పెంచుకోవాలనీ, నా విద్య నీకు నేర్పాలనీ కోరిక కలిగింది. నా అనంతరం నీవు ఆ విద్యను అభ్యసించవచ్చు.



ఇలా నగలు చేసి శ్రమపడి ఏ అందమూ, ఆరోగ్యమూ చెడగొట్టుకోవలిసిన అవసరం లేదు. నా విద్య ఎంత అపురూపమైనదంటే దాన్ని సంపాదించటానికి ఎన్ని వేల మందైనా ప్రాణాలు అర్పించి ఉందురు. నిన్ను ఈ దుకాణంలో చూసేవరకూ నాకు ఈ విద్యను మరొకరికి నేర్పాలనే ఆలోచనే రాలేదు,'' అన్నాడు.

అంతా విని హసన్, ''సరే, నన్ను పెంచుకుని నాకు మీ విద్య నేర్పెయ్యండి. ఎప్పుడు నేర్పుతారు?'' అని ఆత్రంగా అడిగాడు.

''రేపు,'' అని చెప్పి పర్షియను అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఆనందంతో కూడిన ఆరాటంలో హసన్ దుకాణం మూసేసి, తల్లి దగ్గిరికి పరిగెత్తుకుపోయి, ఈ సంగతంతా ఆమెతో చెప్పాడు.

ఆమె హసన్‌తో, ''నాయనా, పర్షియన్ నాస్తికుల మాటలు నమ్మవచ్చా? వాళ్ళు అగ్నిని ఆరాధిస్తారు. వాళ్ళకు తెలిసిన విద్య బంగారం చెయ్యటం. కాని వాళ్ళ స్నేహం చేసినవాళ్ళెవరూ, బాగుపడరు, నాశనమైపోతారు,'' అన్నది.

హసన్ నిర్లక్ష్యంగా నవ్వి, ''అమ్మా, మనం పేదవాళ్ళం. మన నుంచి ఎవరూ ఏమీ దోచుకోలేరు. ఆ ముసలాడు ఎంతో యోగ్యుడులాగున్నాడు. ఆయన దయ మన మీద ప్రసరించటం వల్ల మనకు లాభమే కలుగుతుంది,'' అన్నాడు.

ఎటూ చెప్పలేక తల్లి ఊరుకున్నది. ఆత్రంతో తహతహలాడిపోతూ హసన్ ఆ రాత్రి కన్ను మూయలేదు. మర్నాడు తెల్లవారుతూనే వాడు లేచి తన దుకాణానికి వెళ్ళాడు. కొద్దిసేపట్లో పర్షియను వచ్చాడు. ఆయన హసన్‌ను కౌగలించుకుని, ''నీకు పెళ్ళి అయిందా, బాబూ?'' అని అడిగాడు.

''ఇంకా లేదు. మా అమ్మ నన్ను పెళ్ళాడమని చాలా రోజులుగా తొందర చేస్తోంది,'' అన్నాడు హసన్.

''ఖేప్! నా విద్య బ్రహ్మచారులకి మాత్రమే చెప్పేది,'' అంటూ వృద్ధుడు, ''పాత రాగి ఏమైనా నీ వద్ద ఉన్నదా?'' అని అడిగాడు.

హసన్ విరిగిపోయిన రాగిపళ్లెం ఒకటి తెచ్చి వృద్ధుడికి చూపాడు.

''అదే కావలసింది. ఈ రాగిని ముక్కలు ముక్కలుగా నరికి ఆ ముక్కలను మూసలో పెట్టి, కొలిమిలో పెట్టి, తిత్తిపోసి కరిగించు.'' అన్నాడు వృద్ధుడు.

త్వరలోనే హసన్ ఆ పాత రాగిని కరిగించాడు. అప్పుడు వృద్ధుడు లేచి వచ్చి, ''హక్, మక్, బక్! రాగి బంగారం కావాలి!'' అని మూడుసార్లు అని, తన తలపాగా మడతల్లో నుంచి ఒక పొట్లం తీసి, అందులో నుంచి కుంకంపువ్వు రంగుగల పొడి చిటికెడు తీసి మూసలో వేశాడు. వెంటనే మూసలోని రాగినీరు గడ్డకట్టుకుపోయి బంగారు కణిక అయింది

హసన్ ఇది చూసి నివ్వెరపోయాడు. వృద్ధుడి ఆదేశానుసారం అతను ఆ కణికెను గీటురాయి మీద గీసి చూస్తే అది కల్తీలేని మేలిమి బంగారమని రుజువయింది. ఆ బంగారానికి నగల వర్తకులు మంచి ధర యిస్తారు.

వృద్ధుడు హసన్‌తో, ''వెంటనే దాన్ని తీసుకుపోయి బజారులో అమ్మి డబ్బు తెచ్చుకో. ఇది ఎలా వచ్చిందీ, ఎవ్వరికీ చెప్పకు,'' అన్నాడు.





హసన్ దాన్ని రెండు వేల దీనారాలకు అమ్మి, ఆ డబ్బు తీసుకుని ఇంటికి వెళ్ళి తల్లికి చూపించి, ఇదంతా పర్షియను దయ వల్లనే సాధ్యపడిందని చెప్పాడు. ఈ మాట అన్నందువల్ల తల్లి అనుమానాలేవీ రహితం కాలేదు, అయినా హసన్ ఆమె అనుమానాలు లక్ష్యపెట్టక, తమ వంట ఇంట్లో ఉండే ఇత్తడి సన్నికల్లు తీసుకుని తన దుకాణానికి పరిగెత్తాడు.

వృద్ధుడింకా దుకాణంలోనే ఉన్నాడు. హసన్ సన్నికల్లును ఒకపక్క పెట్టి కొలిమికి తిత్తిపోసి మంట చేస్తూండటం చూసి వృద్ధుడు, ''ఏం చేస్తున్నావు?'' అని అడిగాడు.

"దీన్నికూడా బంగారంగా మార్చుదాం." అన్నాడు హసన్.

వృద్ధుడు నవ్వి, ''ఒక్కరోజు నీ దగ్గిర ఇంత బంగారం ఎలా వచ్చిందని అందరూ అనుమానించరా? నీ రహస్యం ఎలా దాగుతుంది?'' అన్నాడు.

''అది నిజమేగాని, మీ విద్య త్వరగా నేర్చుకోవాలని నాకు తహతహగా ఉంది.'' అన్నాడు హసన్.

వృద్ధుడు గట్టిగా నవ్వి, ''ఇది నడి బజారులో నేర్చుకునే విద్య అనుకున్నావా? నిజంగా ఈ విద్య నేర్చుకోవాలని వుంటే నీ పనిముట్లతో మా యింటికి రా,'' అన్నాడు.

సరేనని హసన్ వృద్ధుడి వెంట బయలుదేరాడు. కాని వీధిలో నడుస్తూండగా అతనికి, పర్షియను నాస్తికులను గురించి తన తల్లి చేసిన హెచ్చరిక జ్ఞాపకం వచ్చింది. అతను నడిచేవాడల్లా చప్పున ఆగిపోయి తీవ్రమైన ఆలోచనలో పడ్డాడు. ముసలివాడు ఆ సంగతి గ్రహించాడు.

''బిడ్డా, నిన్నేదో సంకోచం పట్టి పీడిస్తున్నట్టున్నది. ఈ పరుసవేది విద్యను మా ఇంట నేర్చుకోవటానికి నీ కేమైనా అభ్యంతరం ఉంటే మీ యింటికే వచ్చి నేర్పుతాను,'' అన్నాడు వృద్ధుడు.

అలా చేస్తే తన తల్లి భయాలకు తావుండదనుకుని హసన్ సరేనన్నాడు.

ఇద్దరూ కలిసి హసన్ ఇంటికి వెళ్ళారు. వృద్ధుణ్ణి బయట వసారాలో ఉండమని హసన్ లోపలికి వెళ్ళి, "అమ్మా, ఆయన మన ఇంటికి ఆతిథ్యానికి వచ్చాడు. ఒక సారి మన ఉప్పు తిన్నాక ఇక మన కెలాటి ద్రోహమూ చెయ్యడు," అన్నాడు.

"నాయనా, అలాటి పట్టింపులు మనకే గాని అగ్నిని పూజించే నాస్తికులకుండవు. నీ క్షేమం గురించి నా ఆరాటం తీరిందను కోకు. అతిథిని తెచ్చావు గనక వంట చేసి పెడతాను గాని, ఆ మనిషి లోపలికి వస్తే నేనీ చూరుకింద కూడా ఉండను. పొరుగింటికి వెళ్ళి ఆ మనిషి వెళ్ళిపోయాకే మళ్ళీ ఇంట అడుగుపెడతాను," అన్నది, హసన్ తల్లి.

అలాగే ఆమె రకరకాల కూరలు కొని తెచ్చి పుష్కలంగా వంటకాలు తయారు చేసి, వాటిని తినటానికి సిద్ధంగా ఉంచి పొరుగింటికి వెళ్ళిపోయింది.

తరవాత హసన్ వృద్ధుణ్ణి లోపలికి తీసుకువచ్చి భోజనానికి కూచోబెట్టి, "మా యింట మీరు భోజనం చేశాక మన మధ్య బంధం ఏర్పడుతుంది," అన్నాడు.

"అది చాలా పవిత్రమైన బంధం, నాయనా! నీ మీద ఎంతో ప్రేమ లేకపోతే ఈ అపూర్వమైన విద్య నీకు చెబుతానా?" అంటూ వృద్ధుడు తన తలపాగాలో నుంచి పొట్లం తీసి, "చూడు, ఇందులో ఉన్న పొడితో ఎన్ని మణుగుల బంగారం చేయవచ్చు. ఇందులో వెయ్యి మూలికలూ, వెయ్యి దినుసులూ చేర్చి ఎంతో శ్రమపడి తయారు చేశాను. ఆ పద్ధతంతా నీకు నేను చెబుతాను." అంటూ ఆ పొట్లాన్ని హసన్‌కు అందించాడు.

హసన్ ఆ పొడిని ఆశ్చర్యంతో చూసే సమయంలో హసన్ పళ్ళెంలో కొంత ఆహారం పెట్టి అందులో వృద్ధుడు మత్తు మందు కలిపి, "తిను, నాయనా!" అన్నాడు.

హసన్ ఒక్క ముద్ద నోట పెట్టు కుంటూనే స్పృహతప్పి పడిపోయాడు.

—(ఇంకా ఉంది)





# గంధర్వ చక్రవర్తి కూతురు

## 2

హసన్ స్పృహ కోల్పోగానే, ''ఇప్పుడు నా నుంచి తప్పించుకుపోలేవురా, బిడ్డా!'' అంటూ వృద్ధుడు తాను కూచున్న చోటు నుంచి లేచి, హసన్ కాళ్ళు మడతపెట్టి రొమ్ముకు బిగగట్టి, అక్కడ వున్న ఒక బట్టలపెట్టె ఖాళీ చేశాడు.

తరవాత ఆ దుర్మార్గుడు హసన్‌ను ఆ పెట్టెలో పెట్టి, ఇంట్లో ఉన్న డబ్బంతా తీసుకుని, బయటికి వెళ్ళి ఒక కూలీని మాట్లాడి తెచ్చి, వాడిచేత పెట్టె మోయించుకుని తిన్నగా రేవుకు వెళ్లాడు. అక్కడ ఒక ఓడ సిద్ధంగా ఉన్నది. ఓడ సరంగు వృద్ధుణ్ణి చూడగానే పెట్టెతో సహా ఎక్కించుకుని, లంగరు ఎత్తి ఓడను సముద్రం మీదికి నడిపించాడు.

కొంతసేపయాక హసన్ తల్లి ఇంటికి వచ్చి చూసుకుంటే హసన్ లేడు, పెట్టె లేదు. కిందటి రోజు హసన్ బంగారం అమ్మి తెచ్చిన డబ్బు కూడా లేదు. పెట్టెలో ఉండిన బట్టలన్నీ చెల్లాచెదరుగా పడి ఉన్నాయి. బయటి వాకిలి తెరిచి ఉన్నది. ఆమె తల బాదుకుని, తన బట్టలు చించుకుని కొడుకును మళ్ళీ చూడననీ, భయపడినంతా అయిందనీ ఏడ్చింది. ఆమెను ఓదార్చటం ఇరుగు పొరుగు వాళ్ళకు సాధ్యం కాలేదు.

ఆమె తన నట్టింట కొడుకు పేర ఒక చిన్న గోరీ కట్టించి, అహోరాత్రాలు దాని దగ్గిరే కాపలా వుండి ఏడుస్తూ కాలం గడపసాగింది.

హసన్‌ను మాయజేసి పట్టుకుపోయిన పర్షియను ఒక భయంకర మాంత్రికుడు. వాడి పేరు బెహ్రామ్. వాడు తన మాయ విద్యలకు ఎందరో ముస్లిము కుర్రాళ్ళను



కాని అది వాళ్ళ దేశం కాదని కూడా తెలిసింది. ఎందుకంటే ఈ సముద్ర తీరాన ఇసుకలో నల్లని, తెల్లని, పచ్చని, ఎర్రని గులకరాళ్ళున్నాయి. వాడు ఆశ్చర్యంతో లేచి నిలబడగానే వెనకగా ఒక రాతి మీద కూచుని ముసలాడు కనిపించాడు. వాడే తనని మోసం చేసి ఇక్కడికి తెచ్చాడనీ, తల్లి అన్న మాటలు అక్షరాలా నిజమయాయనీ హసన్ గ్రహించాడు.

అతడు ముసలాడి దగ్గిరికి పోయి, "నాయనగారూ, ఇదంతా ఏమిటి? మా ఇంటి ఉప్పు తిన్నారే!" అన్నాడు.

ముసలాడు గట్టిగా నవ్వి, "అగ్నిని పూజించే బెహ్రాంకు ఉప్పు తిన్న నిర్బంధ మేమిటి? నీవంటి ముస్లిము యువకుల్ని తొమ్మిదివందల తొంభైతొమ్మిదిమందిని బలి ఇచ్చాను. నువు వెయ్యోవాడివి. నా చేతిలో చిక్కావు. తప్పించుకోలేవు. నీ దేవుణ్ణి విడిచిపుచ్చి నా లాగా నువ్వు కూడా అగ్నిని అర్చించు," అన్నాడు.

ఆ మాటలకు మండిపోయి, "నీచుడా, ఏమిటి నువ్వనేది?" అని హసన్ గట్టిగా అరిచాడు.

వెంటనే బెహ్రాం తన వాలకం మార్చేసి, "నిన్ను పరీక్షించటాని కలా అన్నాను, నాయనా! భేష్, పరీక్షలో నెగ్గావు. ఏకాంత ప్రదేశంలో నీకు నా విద్య

బలి ఇచ్చాడు. ఈసారి వాడికి హసన్ దొరికాడు.

సముద్ర ప్రయాణం సాగినన్నాళ్ళూ బెహ్రాం హసన్‌ను పెట్టెలోనే ఉంచి మత్తుమందు కలిపిన ఆహారం పెడుతూ వచ్చాడు. కొన్నాళ్ళకు ఓడ అవతలి తీరాన్ని చేరింది. బెహ్రాం పెట్టెతో సహా ఒడ్డున దిగాక ఓడ వెళ్ళిపోయింది. అప్పుడు ముసలివాడు హసన్‌ను పెట్టెలో నుంచి పైకి తీసి, కట్లు ఊడదీసి, వాడి మత్తు వదలటాని కేవో మందులు వాసన చూపించాడు.

హసన్ కళ్ళు తెరిచి చూసేసరికి తాను సముద్రం ఒడ్డున ఉన్నట్టు తెలిసింది,



చెబుదామనే ఉద్దేశంతోనే ఇక్కడికి తెచ్చాను. అదుగో ఆ కనబడే కొండ చూశావా? దాని శిఖరం మబ్బులకన్న ఎత్తుగా ఉంది. అందుచేత దాన్ని మబ్బుల కొండ అంటారు. మనకు కావలిసిన మూలికలన్నీ దాని మీద ఉన్నాయి. మనం ఇప్పుడక్కడికి ఎక్కాలి," అన్నాడు.

హసన్ అనుమానం కొంత తగ్గింది. అతను బెహ్రాంను, "ఆ కొండ గోడలాగా ఉందే, దాని శిఖరానికి ఎలా ఎక్కటం?" అని ప్రశ్నించాడు.

"మనకు ఎక్కవలిసిన పనే లేదు. పక్షుల్లాగా వెళ్ళి అక్కడ వాలుదాం," అంటూ బెహ్రాం తన పైబట్ట లోపలి నుంచి ఒక రాగితప్పెట తీశాడు.

దానిపైన కోడిపుంజు చర్మం పరిచి ఉన్నది. ఆ చర్మం మీద ఏవో బీజాక్షరాలు రాసి ఉన్నాయి.

బెహ్రాం ఆ తప్పెట మీద వేళ్ళతో వాయించగానే పెద్ద ఎత్తున ధూళి లేచి, అది లేచినచోట ఒక నల్లని రెక్కల గుర్రం ప్రత్యక్షమయింది. దాని ముక్కు నుంచి జ్వాలలు వెలువడుతున్నాయి. బెహ్రాం దాని పైన ఎక్కి కూచుని, హసన్‌కు సహాయం చేసి తన వెనక ఎక్కించుకున్నాడు. వెంటనే ఆ గుర్రం రెక్కలాడించి, రివ్వున గాలిలోకి లేచి, కనురెప్పపాటు కాలంలో మబ్బుల కొండ శిఖరం మీద వాలింది. తరవాత బెహ్రాం, హసన్ లిద్దరూ కిందికి దిగగానే అదృశ్యమైపోయింది.

హసన్ అనుమానాలు తిరిగి వచ్చాయి. వాడు చుట్టూ కలయజూస్తే ఏ విధమైన మూలికలూ లేవు. బెహ్రాం వాడితో, "ఇప్పుడు నిన్ను ఏ ప్రాణీ రక్షించలేదు! నా నుంచి ఎలా తప్పించుకుంటావు?" అని బిగ్గరగా నవ్వాడు.

హసన్‌కు పట్టరాని ఆగ్రహం వచ్చేసింది. "నీచుడా, నాకు అల్లా అంత ఉన్నది. చూడు అల్లా సహాయంతో నిన్నేం



చేస్తానే!'' అంటూ ఒక చేత్తో ముసలాడి చేతిలో ఉన్న రాగితప్పెట లాగేసి, రెండో చేత్తో బలంకొద్దీ అతణ్ణి కొండ మీది నుంచి తోసేశాడు. బెహ్రాం గాలిలో పిల్లిమొగ్గలు తిరుగుతూ, ప్రాణభయంతో అరుస్తూ కిందపడి రాళ్ళ మీద పచ్చడి అయి పోయాడు.

ఆ మాంత్రికుడికి భూమి మీద నూకలు చెల్లిపోయాయి.

హసన్ దుర్మరణం నుంచి తప్పించుకోవడమే గాక తన శత్రువైన బెహ్రాంను కూడా తుదముట్టించి విముక్తుడయాడు. అతను తన చేతిలో ఉన్న తప్పెటను తిప్పి తిప్పి చూశాడు, కాని దాన్ని ఎలా ఉపయోగించేది తెలుసుకోలేక, చేతగాక ఏం చేస్తే ఏం జరుగుతుందోనని సంశయించి, దానిని తన రొండిన కట్టుకుని, చుట్టూ ఒకసారి కలయజూశాడు.

అతనున్న కొండ శిఖరం మబ్బుల కన్న ఎత్తుగా ఉన్నప్పటికీ, ఆ ప్రాంతం చాలా విశాలమైన సమ ప్రదేశంగా ఉన్నది. ఎక్కడా ఒక చెట్టుగాని, పొద గాని లేదు; బ్రహ్మాండమైన రాతి మైదానం. ఈ మైదానం ఒక చివర హసన్ ఉన్నాడు. దాని రెండో చివర అతనికి మంటలు ప్రకాశిస్తున్నట్టు కనిపించింది. మనిషి లేనిచోట మంట లుండవనుకుంటూ హసన్ వేగంగా ఆ మంటలకేసి నడవ నారంభించాడు.

అతను దగ్గిరికి వచ్చినకొద్దీ ఆ మంటలు ఒక పెద్ద భవనంగా మారాయి. ఆ భవనానికి నాలుగు బ్రహ్మాండమైన స్తంభా లున్నాయి. వాటిపైన ఒక గుండ్రని గుమ్మటం ఉన్నది. స్తంభాలకూ, గుమ్మటానికీ, భవనానికీ బంగారు రేకు తొడిగి ఉన్నది. సూర్యకాంతి ఈ బంగారు భవనం పైన పడటంచేత హసన్ మంటలు కనిపించాయని భ్రమపడ్డాడు.

హసన్ మానసికంగానూ, శారీరకంగానూ బాగా బడలి ఉన్నాడు. ''ఈ భవనం మనుషులుండేది కాదు. ఏ

యక్షులలో; గంధర్వులలో ఉండేది. అయితే అయింది. ద్వారపాలకుణ్ణి వేడుకుని మంచినీరడుగుతాను, ఏ మూలనన్నా నడుం వాల్చనిస్తే నిద్రపోతాను,'' అను కుంటూ హసన్, పచ్చరాతిలో మలిచిన ద్వారం గుండా భవన ప్రాంగణంలోకి అడుగుపెట్టాడు.

అతను కొద్ది అడుగులు నడిచాడోలేదో, ఇద్దరు కన్యలు ఒక చలవరాతి బల్లమీద కూచుని చదరంగం ఆడుతూ కనిపించారు. మొదట వాళ్ళు హసన్‌ను చూడ లేదుగాని, కొంతసేపటికి వారిలో చిన్నది తల ఎత్తి, తమ సమీపాన నిలబడి ఉన్న యువకుణ్ణి చూసి, ''అక్కా, ఎవరో అబ్బాయి వచ్చాడు చూడు. దుర్మార్గుడు బెహ్రాం ఏటా ఇలాటి యువకుల్ని మబ్బుల కొండపైకి తెస్తూంటాడు. ఈ అబ్బాయిని కూడా వాడే తెచ్చాడేమో! అలా అయితే ఇతను ఆ మాయదారి వాడి నుంచి ఎలా తప్పించుకుని ఉంటాడు? చాలా ఆశ్చర్యం,'' అన్నది.

హసన్ ఆమె కాళ్ళపై బడి, ''అమ్మా, నేను అలాటి అభాగ్యుణ్ణే!'' అంటూ కంట తడి పెట్టుకున్నాడు. అతని దుస్థితి అర్థమై ఆమెకు హసన్ పైన ఎక్కడలేని జాలి పుట్టుకొచ్చింది.

ఆమె తన అక్కతో, ''అక్కా, నేని కుర్రవాణ్ణి నా తమ్ముడుగా పెంచుకో బోతున్నాను. అందుకు నీవే సాక్షి,'' అన్నది.

తరవాత ఆమె హసన్‌ను భవనంలోకి తీసుకుపోయి, సుఖంగా స్నానం చేయించి, అతని పాత దుస్తులు అవతల పారేయించి, మంచి దుస్తులు కట్టబెట్టింది.

ఆ తరవాత ఆ అక్కచెల్లెళ్ళు హసన్‌ను తమ మధ్య కూచోబెట్టుకుని భోజనం చేయించారు.

ఈ తతంగమంతా ముగిసినాక హసన్ వారితో, ''అక్కలారా, నాకు మీరు తటస్థపడే అదృష్టం కలగక పూర్వం నేను చాలా కష్టాలు పడ్డాను,'' అంటూ తన కథ యావత్తూ చెప్పాడు.

—(ఇంకా వుంది)





# గంధర్వ చక్రవర్తి కూతురు

3

హసన్ తన కథ పూర్తిచేసినాక అతన్ని పెంచుకున్న ఆమె తమ కథ అతనితో ఇలా చెప్పింది:

"మేమొక గంధర్వరాజు కుమార్తెలం. అందరమూ కలిసి ఏడుగురము. అందరమూ ఒక తండ్రి బిడ్డలమే గాని ఒక తల్లి బిడ్డలం కాము. అందరిలోకి నేనూ, మా అక్క చిన్నవాళ్ళం. మిగిలిన మా అయిదుగురు అక్కలూ వేటకి వెళ్ళారు. త్వరలోనే తిరిగి వస్తారు. మా అక్క చెల్లెళ్ళను పెళ్ళాడే అర్హత గల వాళ్లెవరూ సృష్టిలోనే లేరని మా తండ్రి గారి నమ్మకం. మేము శాశ్వతంగా కన్యలుగానే ఉండిపోవాలని ఆయన నిర్ణయించి, మేము ఉండటానికి గాను ఈ మారుమూల ప్రదేశంలో ఈ భవనం కట్టించారు. ఈ ప్రదేశం మటుకు చాలా మనోహరమైనది. జలసమృద్ధి గలది. ఎక్కడ చూసినా పూలచెట్లూ, పళ్ళచెట్లూ కనిపిస్తాయి. చక్కని సరస్సులున్నాయి. వాటిలో రాజహంసలున్నాయి, స్వర్గంలాటి ఈ ప్రదేశంలో మేము చాలా సుఖంగా ఉన్నాము. మాకు ఒక్కటే కొరత ఉండేది. ఎంత కాలం గడిచినా మాకు మా ముఖాలు తప్ప కొత్త ముఖాలు కనిపించవు. నువ్వు యిక్కడికి రావటంతో మాకు ఆ లోటు తీరింది."

ఆమె తన తమ్ముడితో ఇలా కబుర్లు చెబుతూండగానే మిగిలిన అయిదుగురు రాకుమార్తెలూ వేటనుంచి తిరిగి వచ్చారు. తలవని తలంపుగా తమ కొక తమ్ముడు దొరికినందుకు ఎంతో సంతోషించి, వారతనిచేత చాలాకాలం ఉంటావని వాగ్దానం పుచ్చుకున్నారు.

ఆరేబియా కథలు



హసన్ అక్కడి వింతలన్నీ చూస్తూ ఆ గంధర్వరాజు కుమార్తెల వెంట ఉండి పోయి, వారితో షికార్లకూ, వేటకూ వెళ్ళాడు. ఆ అక్కలను చూసుకుని అత నెంత గర్వించాడో అతన్ని చూసుకుని వారూ అంత ఆనందించారు. వాగుల వెంబడి, తోటల్లోనూ ఆడుతూ, ఒకరి ప్రపంచం గురించి ఒకరు విచిత్ర విష యాలు తెలుసుకుంటూ, ఆ ఎనిమిది మందీ ఒక తల్లి కన్న పిల్లల్లాగా అన్యో న్యంగా మసలుకున్నారు.

ఒకనాడు అందరూ పొదల మధ్య చేరి పాటలు పాడుకుంటూండగా ఒక్కసారిగా ఆకాశంలోకి దుమ్ము లేచి సూర్యబింబాన్ని ఆవరించేసింది. అదే సమయంలో ఉరుములాటి ధ్వని వారికేసి వచ్చింది. రాజకుమార్తెలంతా భయపడిన వారిలాగా హసన్‌తో, "ఎటన్నా వెళ్ళి దాక్కో!" అన్నారు. కడగొట్టు రాజకుమార్తె హసన్‌ను చెయ్యి పట్టుకుని తోటలో ఒకచోటికి తీసుకుపోయి దాక్కోబెట్టింది.

త్వరలోనే గంధర్వుల బలగం ఒకటి వచ్చి భవనం దగ్గిర వాలింది. మరొక గంధర్వరాజు గౌరవార్థం రాజకుమార్తెల తండ్రి విందు చేస్తున్నాడట. తన కుమార్తె లను తీసుకు రమ్మని ఆయన తన పరివా రాన్ని పంపాడు. ఈ వార్త తెలియగానే కడగొట్టు రాజకుమార్తె హసన్ వద్దకు వచ్చి, "తమ్ముడూ, నిన్ను ఒంటరిగా విడిచి మేము కొన్ని రోజులపాటు వెళ్ళ వలసి వచ్చింది. ఇవిగో తాళపు చెవులు. మేము తిరిగి వచ్చేదాకా ఈ భవనమంతా నీదే. కాని ఒక్క విషయం జాగ్రత్త. ఈ తాళపు చెవితో తెరుచుకునే గదిలోకి మాత్రం ప్రవేశించకు," అని నీలపురాయి పొదిగిన తాళపు చెవి అతనికి చూపింది.

తరవాత ఏడుగురు రాజకుమార్తెలూ తమ కోసం వచ్చినవారి వెంట తమ తండ్రి ఇంటికి వెళ్ళిపోయారు.

వారు వెళ్ళాక భవనమంతా బిక్కు బిక్కుమంటూ బోసిపోయినట్టున్నది.

హసన్ కాలుగాలిన పిల్లిలాగా గదులన్నీ తిరిగి, తన అక్కలు వాడే వస్తువులూ, వారు తిరిగే చోట్లూ చూసి వేదనపడ్డాడు. ఒకసారి అతను తెరవరాని తలుపువద్దకు వచ్చాడు. దాన్ని తెరవరాదన్న సంగతి జ్ఞాపకం వచ్చి వెనక్కు వెళ్ళిపోయాడు.

అయితే అతని తలలో ఆలోచనలు వెనక్కు తిరగలేదు: "ఈ తలుపు తెరవరాదనటానికి కారణం ఏమై ఉంటుంది? ఆ గదిలో ఏమి వింత ఉండవచ్చును? ఏమైనా ఆ గదిలోకి పోనని మాట ఇచ్చాను గద!" ఇలా అనుకుని కూడా ఆ తలుపును అతను మరువలేకపోయాడు. దాన్ని గురించిన ఆలోచనలతో అతనికి నిద్ర కూడా పట్టలేదు. ఏమైతే అయింది, ఆ తలుపు తెరుద్దామనుకున్నాడు. పోనీ తెల్లవారినదాకా ఆగుదామనుకున్నాడు. చిట్టచివరకు, "ప్రాణం పోయినా సరే ఆ తలుపు తెరిచి అక్కడేమున్నదో చూడవలసిందే!" అని నిశ్చయించుకున్నాడు.

హసన్ ఒక దివ్వె తీసుకుని ఆ తలుపు దగ్గిరికి వెళ్ళి తాళం చెవి పెట్టి తిప్పాడు. నిశ్శబ్దంగా తలుపు దానంతట అదే తెరుచుకున్నది. హసన్ నిర్భయంగా లోపలికి అడుగు పెట్టాడు.

ఆ గదిలో ఒక క్రూరసామూహము గాని, తివాసీగాని, చాపగాని, ఏమీలేదు. ఖాళీ




గది. ఒక పక్కగా నిచ్చెన ఉన్నది. అది గది కప్పు దాటి పైకి వెళ్ళిపోయింది. హసన్ నిచ్చెన మెట్లెక్కి కప్పులో కంత గుండా పైకి వెళ్ళిపోయాడు.

పైభాగం సమతలంగా ఉన్నది. అక్కడ అతనికొక చిన్న తోట కనిపించింది. అందులో మొక్కలూ, పూలపొదలూ ఉన్నాయి. అతను ఆ తోటలోకి అడుగు పెట్టేసరికి ఒక అత్యద్భుతమైన మనోహర దృశ్యం అతని కంట పడింది. అతని ముందు ఒక నిశ్చలమైన సరస్సు అద్దంలాగా ఆకాశాన్ని ప్రతిబింబిస్తున్నది. సరస్సుకు ఆవతలి వైపున ఒక వింతైన భవనం వున్నది. దాని బురుజులు ఎంతో



ఎత్తుగా ఆకాశంలోకి చొచ్చుకుపోయాయి. ఆ భవనానికీ, సరస్సుకూ మధ్య చలవ రాళ్లతోనూ, చుక్కల రాళ్ళతోనూ కట్టిన మెట్లున్నాయి. మెట్ల దిగువన, నీటి పైకి పొడుచుకు వచ్చేలాగా ఒక-అరుగున్నది. దీనిని కెంపు, పుష్యరాగం,. బంగారు, వెండి పలకలతో నిర్మించారు. ఈ అరుగు మీద నాలుగు గులాబీ రంగుగల స్ఫటిక శిలలతో కట్టిన స్తంభాలూ, వాటి పైన పరిచిన పలచని ఆకుపచ్చ రంగు బట్టా, దాని కింద చక్కని సింహాసనమూ ఉన్నాయి. వీటన్నిటినీ నిర్మించటంలో చూపిన పనితనం ఎంతేసి రాజులకూ సాధ్యపడేది కాదు.

హసన్ కొయ్యబొమ్మలాగా నిలబడి ఈ అద్భుత దృశ్యం చూసి ఆనందిస్తూండే సమయంలో పది పెద్ద పక్షులు ఎగురుతూ ఆకాశం నుంచి దిగివచ్చి సరస్సు ఒడ్డున వాలాయి. అవి కాస్సేపు ఒడ్డున అటూ ఇటూ తిరిగాక, వాటిలో పెద్ద పక్షి సింహాసనం వద్దకు కదిలి వచ్చింది. మిగిలిన తొమ్మిది పక్షులూ దాన్ని అనుసరించాయి.

హసన్ నిర్ఘాంతపోయి చూస్తూండగానే ఆ పక్షులన్నీ తమ తొడుగుల నుంచి స్త్రీల ఆకారంతో బయటికి వచ్చాయి. ఒక్కొక్క స్త్రీ ఒక్కొక్క చంద్రబింబం లాగున్నది. అందరూ తమ పక్షి తొడుగులను వదిలేస్తూనే సరస్సులోకి దూకి ఓలలాడ నారంభించారు. వాళ్ళు ఒకరి నొకరు తరుముకుంటూ గట్టిగా నవ్వసాగారు. వారి నవ్వులకు దిక్కులన్నీ ప్రతిధ్వనించాయి. వారందరినీ అందంలోనూ, చలాకీతనంలోనూ మించిన ఒక సుందరి హసన్‌ను ప్రబలంగా ఆకర్షించింది. అతను ఒక పొద చాటున నక్కి, తనను ఆకర్షించిన సుందరిని తదేక దృష్టితో గమనించసాగాడు.

త్వరలోనే ఆ కన్యలు జలకాలు ముగించి, సన్నని వలిపెపు దుస్తులు ధరించి చాందినీ కింద విశ్రాంతి తీసు

కున్నారు. ఇంతలో ఎవరో, "తెల్లవార వస్తోంది. ఇక మనం బయలుదేరి పోదామా?" అన్నారు.

వెంటనే అందరూ తమ తమ పక్షి తొడుగులు ధరించి, ఒక్కసారిగా ఆకాశం లోకి ఎగిరిపోయారు.

వాళ్ళు వెళ్ళినాక కూడా హసన్ శూన్యాకాశంలోకి చూస్తూ అలాగే చాలా సేపు నిలబడిపోయాడు. హసన్ అంతవరకూ ఎన్నడూ ప్రేమ అనేది ఏమిటో ఎరగడు. తీరా ప్రేమ అంటే ఏమిటో తెలిసినాక అతనికి జీవితమంతా శూన్యమైపోయినట్టయింది. అతను ఆ రోజల్లా ఒక యుగంగా గడిపి రాత్రి కాగానే మళ్లీ సరస్సు వద్దకు వచ్చాడు. కాని ఆ రాత్రి ఆ కన్యలు రాలేదు. మరుసటి రాత్రి కూడా వారు రాలేదు. హసన్ అన్నమూ, నీరూ, నిద్రా మానేసి, నిరాశలో పడిపోయి, "ఇలా బతికేకన్న చావు మేలు!" అనుకుంటూ ఆ రోజుకారోజు శుష్కించిపోయి మంచం పట్టాడు.

పది రోజులు గడిచాక గంధర్వ రాజకుమార్తెలు తండ్రి ఇంటి నుంచి తిరిగి వచ్చారు. వస్తూనే హసన్ అక్క అతన్ని వెతుక్కుంటూ వచ్చి, అతని దుస్థితి చూసి కంటనీరు పెట్టుకుంటూ, "ఇదేమిటి, తమ్ముడూ? ఎందుకిలా అయిపోయావు? మొహమంతా పాలిపోయింది! కళ్ళు గుంటలు పడ్డాయి! నీ వ్యాధి ఏమిటో దాచకుండా చెప్పు!" అన్నది.

హసన్ కూడా కంటనీరు కారుస్తూ, "నేను చేసిన తప్పుకు శిక్ష అనుభవిస్తున్నాను. ఎవరూ కూడా నాకు సహాయం చెయ్యలేరు. నే నిలాగే ప్రాణాలు వదిలేస్తాను." అన్నాడు.

"అలా ఎన్నడూ అనుకోకు. నీ ప్రాణానికి మా అందరి ప్రాణాలూ అడ్డేస్తాము. నీవు చావటమే జరిగితే నేనూ చనిపోతాను," అన్నది అతని అక్క.

"నేను ఆహారం ముట్టి పది రోజులయింది," అంటూ హసన్ జరిగినదంతా ఆమెకు చెప్పాడు. —(ఇంకా ఉంది)






## 4

అక్క వద్దన్న పని చేసినందుకు చివాట్లు తగులుతాయని హసన్ అనుకున్నాడు. అయితే అతని అక్క అతన్ని పల్లెత్తు మాట కూడా అనకపోగా అతని స్థితికి జాలిపడి, "నువ్వు అధైర్యపడకు. నీవు ప్రేమించిన కన్య నీకు దక్కేటట్టు నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. అయితే నీ రహస్యం నా మిగిలిన అక్కలకు ఏ మాత్రమూ తెలియనివ్వకు. తెరవరాని తలుపు మాట వస్తే అది ఎక్కడ ఉన్నదీ కూడా నీకు తెలియదని చెప్పు. ఎందుకిలా కృశించిపోయావని అక్కలు ప్రశ్నిస్తే, 'మీ కోసం బెంగపడి ఇలా అయాను,' అని జవాబు చెప్పు." అని సలహా ఇచ్చింది.

తరవాత ఆమె తన అక్కలతో, "పాపం, హసన్ ఒంటరిగా ఉండి, మన కోసం బెంగపడి మంచాన పడ్డాడు. అతనికి తన తల్లీ, ఊరూ జ్ఞాపకం వచ్చి, భరించరాని వేదన కలిగిందట!" అన్నది.

ఇది విని రాజకుమార్తెలు ఎంతో నొచ్చుకుని అతని వద్దకు వచ్చి ఎన్నో రకాల ఉపచారాలు చేశారు; అతనిచేత ఆహారం తినిపించారు; తమ తండ్రి దేశంలో చూసిన వింతలన్నీ అతనికి చెప్పారు.

ఈ విధంగా ఒక నెల రోజులపాటు వారు అతనికి ఉపచారాలు చేయగా హసన్ కొంతవరకు కోలుకున్నాడు.

తరవాత ఒకనాడు రాజకుమార్తెలందరూ వేటకు బయలుదేరారు. కడగొట్టు రాజకుమార్తె హసన్‌కు తోడుగా ఉంటానని ఉండిపోయింది. మిగిలిన వాళ్ళు వెళ్ళగానే ఆమె హసన్‌ను సరస్సు సమీపంలో ఉన్న ఉద్యానవనంలోకి



తీసుకుపోయి, "చూడు, హసన్! ఈ సరస్సు పక్కన అనేక స్నాన ఘట్టాలున్నాయి. నీకు కనిపించిన కన్యలు ఎక్కడ స్నానం చేశారు?" అని అడిగింది. హసన్ ఆమెకు సింహాసనం ఉన్న చోటు చూపించాడు.

ఆమె వెలవెలబోతూ, "అరి, భగవంతుడా! నువ్వు చూసిన కన్యలు గంధర్వ చక్రవర్తి కూతుళ్ళు, ఆమె చెలికత్తెలూ. ఆ చక్రవర్తి కింద మా నాన్న ఒక చిన్న సామంతు మాత్రమే. నీవు ప్రేమించినది చక్రవర్తి ఆఖరు కుమార్తె అయి ఉంటుంది. గంధర్వ చక్రవర్తి ఉండే లోకానికి మానవులే కాదు, ఇతర గంధర్వులు కూడా వెళ్లలేరు. నీవు చూసిన గంధర్వ చక్రవర్తి కూతురు ప్రతి అమావాస్యకూ తన చెలికత్తెలతోసహా ఇక్కడికి ఎగిరివచ్చి జలకాలాడి పక్షి తొడుగుల సహాయంతో తమ లోకానికి తిరిగిపోతుంది. ఆ తొడుగును చేజిక్కించుకుంటే తప్ప ఆమె నీకు దొరికే మార్గం లేదు. అందుచేత ఆమె ఇంకొకసారి వచ్చేదాకా ఇక్కడ పొంచి ఉండి, ఆమె సరస్సులో జలకాలాడే సమయంలో ఆమె తొడుగును దొంగిలించు. ఆమె దానిని ఇవ్వమని ఎంత దీనంగా బతిమాలినా నువ్వు చలించకు. చలించిపోయి ఆమెకా తొడుగు ఇచ్చేశావో నువ్వూ, నీతోబాటు మేమూ, మాతోబాటు మా నాన్నా, అందరమూ సర్వనాశనం కావటం నిశ్చయం. నువ్వు గుండె రాయి చేసుకుని ఆమెను జుట్టు పట్టుకుని జరజరా ఈడ్చుకు వచ్చెయ్యటం ఉత్తమమైన పని. అలా చేస్తే ఆమె నీకు లొంగివస్తుంది. ఆ తరవాత ఏమవుతుందో చూద్దాం." అని సలహా యిచ్చింది.

హసన్ ఈ మాటలు విని ఆనందంతో తన్మయుడైపోయాడు.

మర్నాడు అమావాస్య. చీకటి పడగానే హసన్ సరస్సు వద్దకు వెళ్ళి మెట్ల సమీపంలో దాక్కున్నాడు. కొంచెంసేపయాక చక్రవర్తి కుమార్తే, ఆమె చెలికత్తెలా



ఎగురుతూ వచ్చి వాలి, తమ పక్షి ఉడుపులు తీసేసి నీటిలోకి దిగారు. హసన్ దడదడలాడే గుండెతో ఆ ఉడుపులను సమీపించి, తన ప్రియురాలి ఉడుపు సంగ్రహించి, మళ్ళీ వెళ్ళి దాక్కున్నాడు.

కొంతసేపయాక చక్రవర్తి కూతురు నీటి నుంచి పైకి వచ్చి, తన ఉడుపు మాయం కావటం గమనించి, గట్టిగా కేకలు పెట్టసాగింది. ఆమె చెలికత్తెలు ఈ కేకలు విని నీటి నుంచి పైకి వచ్చి జరిగిన సంగతి తెలుసుకున్నారు. తెలుసుకున్న వాళ్ళు తమ యజమానురాలిని ఆపదలో ఆదుకోవటానికి బదులు, బెదిరిపోయిన వాళ్ళలాగా, ఎవరి ఉడుపులు వారు ఆదరా బాదరా తొడుక్కుని, రివ్వున ఆకాశంలోకి ఎగిరిపోయారు.

చక్రవర్తి కూతుర్ని హసన్ సమీపించాడు. కాని అతన్ని చూడగానే ఆమె సరస్సు గట్టున పడి పరిగెత్తసాగింది. అతను ఆమెను వెంబడించాడు. చివరికతను ఆమెను అందుకుని, ఆమె జుట్టు తన చేతిలో మెలివేసి పట్టుకుని తన వెంట నడిపించాడు. ఆమె కళ్ళు మూసుకుని, ఏ మాత్రమూ పెనుగులాడక అతను నడపమన్నట్టు నడిచింది. హసన్ ఆమె కన్నీటిని గాని, ఆక్రందనాన్ని గాని పాటించకుండా, గుండె రాయి చేసుకుని, ఆమెను తన గదికి తెచ్చి, తలుపు బిగంవేసి, ఈ సమాచారం తన అక్కతో చెప్పాడు.

చక్రవర్తి కూతురు తన గదికి చేరినట్టు హసన్ చెప్పగానే అతని "అక్క" ఆమె వద్దకు వెళ్ళి, ఆమె పాదాలపైన పడి, "మహారాణీ, తమ రాకవల్ల మా మందిరం పావనమయింది," అన్నది.

విచార సాగరంలో ఉన్న చక్రవర్తి కుమార్తె తల ఎత్తి ఆమెను చూసి, "నీవేనా? మానవమాత్రుడెవడో నీ ప్రభువు కుమార్తెను ఇలా అవమానించటానికి అవకాశం ఇస్తావా? అసలు ఒక మనిషిని నీ యింట ఎలా చేరనిచ్చావు? ఏమి నీ ధైర్యం? నీ సహకారం లేకుండానే అతను



నా సరస్సు వద్ద పొంచి ఉండి నన్ను పట్టగలుగునా?'' అన్నది.

హసన్ అక్క, "దేవీ, ఈ యువకుడైనా సామాన్యుడు కాడు. అతనికి ఈడొచ్చే మానవమాత్రుడు లేడు. అతని శీలం అత్యద్భుతమైనది. అతని మనసులో దురుద్దేశం మచ్చుకైనా లేదు. విధి ప్రేరితుడై అతను నిన్ను గాఢంగా ప్రేమించటం జరిగింది. దైవనిర్ణయాన్ని ఎవరు మార్చగలరు? ప్రేమికులు కింతవ్యులు. అతను నిన్ను మొదటిసారి చూసినాక ప్రేమోపహతుడై ప్రాణాలు వదిలే దశకు వచ్చాడంటే నమ్ము! నీ వెంట సాటిలేని అందగత్తెలు మరి తొమ్మిది మంది ఉన్నప్పటికీ అతని మనసును నీవు మాత్రమే ఆకర్షించగలిగావు,'' అన్నది.

ఈ సంగతి విన్నాక చక్రవర్తి కుమార్తె తనకు విమోచనం ఉండదని గ్రహించి ఒక్క నిట్టూర్పు విడిచింది.

హసన్ అక్క ఆమెకు మంచి దుస్తులు కట్టబెట్టి, భోజనం వడ్డించి, ఆమె విచారాన్ని తగ్గించటానికి చేయదగిన ప్రయత్నాలన్ని చేసింది. చివరకు చక్రవర్తి కుమార్తె, "నాకు మా తండ్రి నుంచి, జన్మస్థలం నుంచీ ఎడబాటు విధించి ఉన్నది కాబోలు! విధిని ఎలా తప్పించుకోవటం?'' అన్నది.

తమ చక్రవర్తి కుమార్తెకు కొంత ఉపశమనం కలిగించి అక్క హసన్ వద్దకు వచ్చి, "నీ ప్రియురాలి మనసును నీకేసి తిప్పుకో. ఆమెకు చూపవలిసిన మర్యాదలన్నీ చూపు. మాట్లాడేటప్పుడు సౌజన్యం ప్రదర్శించు,'' అని హెచ్చరించింది.

హసన్ చక్రవర్తి కుమార్తె వద్దకు వచ్చి ఆమె ఎదట నిలబడగానే చక్రవర్తి కూతురు అతన్ని ఆపాదమస్తకమూ పరిశీలించి, అతని అపూర్వ సౌందర్యం గమనించి కొంతవరకు మెత్తబడింది. హసన్ ఆమెతో, "రాజకుమారీ, నేను నీకు బానిసలాంటి వాణ్ణి. ఏ విధంగానూ నిన్ను బలాత్కరించాలనే ఉద్దేశం నాకు

ఏ కోశానా లేదు: శాస్త్రవిధి ననుసరించి నిన్ను వివాహం చేసుకోవాలనే నా కోరిక. పెళ్ళి అయినాక మనము నా జన్మస్థల మైన బాగ్దాదు నగరానికి పోదాము. నీకు కావలసినంతమంది దాస దాసీలను ఏర్పాటు చేస్తాను. అక్కడ మా అమ్మ ఉన్నది. ఆమెను మించిన యోగ్యురాలు ప్రపంచంలో ఉండబోదు. ఆమె నిన్ను తన కుమార్తెలాగా చూసుకుంటుంది. ఆమె వంట అద్వితీయమైనది: నీకు దివ్య మైన భోజనం చేసి పెడుతుంది." అన్నాడు.

చక్రవర్తి కుమార్తె అతనికి జవాబు ఏమి చెప్పేదోగాని ఈ లోపుగా ముఖ ద్వారం తట్టిన చప్పుడు వినపడింది. అది తెరిచే పని తనది కావటంచేత హసన్ పరిగెత్తి వెళ్ళి తలుపు తెరిచాడు. వచ్చిన వారు పెద్ద అక్కలు. వారు ఆరుగురూ వేట నుంచి తిరిగివచ్చి, హసన్‌లో కలిగిన మార్పు గమనించారు. హసన్ వారితో చక్రవర్తి కుమార్తె విషయం చెప్పక, వారు కొట్టి తెచ్చిన వేటలన్నిటినీ లోపలికి చేర వేశాడు.

పెద్ద అక్క అతన్ని చూసి, "ఏం, హసన్? ఇవాళ చాలా ఉత్సాహంగా ఉన్నావు! అని అడిగింది. హసన్ సిగ్గుపడి, అప్పుడే వచ్చిన చిన్న అక్కకేసి, "నువ్వు చెప్పు!" అన్నట్టుగా చూశాడు.

"మరేమీ లేదు. మన హసన్ ఇవాళ ఒక పిట్టను పట్టుకున్నాడు. దాన్ని మచ్చిక చేసి పెట్టాలి," అన్నది చిన్నక్క.

"ఈ భాగ్యానికే సిగ్గుపడి పోతాడేం?" అన్నది పెద్దక్క.

"అతనికా పిట్ట మీద ఎంత ప్రేమో చెప్పతరం కాదు." అంటూ ఆమె తన అక్కలకు జరిగిందంతా చెప్పేసింది వారందరూ వెంటనే చక్రవర్తి కూతురున్న చోటికి వెళ్ళి ఆమెకు జోహార్లు చేసి, హసన్‌ను పెళ్ళాడమని ఆమెను ప్రోత్స హించారు. వారే హసన్ చేతిలో ఆమె చెయ్యి పెట్టి పాణిగ్రహణం కూడా చేశారు. —(ఇంకా వుంది)





# గంధర్వ చక్రవర్తి కూతురు

**5**

హసన్, అతడి భార్య అయిన గంధర్వ చక్రవర్తి కూతురూ నలభై రోజులు అక్కడ గడిపినాక హసన్‌కు కలలో తల్లి కనిపించి, తనను మరిచిపోయినందుకు అతన్ని చివాట్లు పెట్టింది. అతను పెద్ద పెట్టున మూలుగుతూ, కన్నీరు కారుస్తూ నిద్ర నుంచి లేచాడు. ఏమి జరిగిందోనని అక్కలందరూ గాభరాపడి పరిగెత్తు కొచ్చారు.

హసన్ భార్యకు కూడా అతని దుఃఖా నికి కారణం తెలియలేదు.

హసన్ తన కల గురించి చెప్పినాక అతని చిన్నక్క, "ఇక నిన్ను ఇక్కడ ఉండనివ్వటం భావ్యం కాదు. మీ అమ్మ వద్దకు వెళ్ళు! కాని ఏటా వచ్చి మాతో కొంతకాలం వుంటానని మాట ఇయ్యి!" అన్నది.

ప్రయాణ సన్నాహమంతా పూర్తి అయ్యాక వెళ్లటం ఎలాగన్న సమస్య వచ్చింది. బ్రహ్మం తాలూకు డప్పు హసన్‌కు జ్ఞాపకం వచ్చింది. ఆ డప్పు ఎలా మోగించాలో అతనికి చిన్నక్క నేర్పింది. దాన్ని మోగించగానే అంతు లేని ఒంటెలూ, గుర్రాలూ, కంచరగాడి దలూ దూకుతూ వచ్చి సొల్పుగా నిల బడ్డాయి. వాటిలో ఉత్తమమైన వాటిని అవసరమైన మేరకు ఉంచేసి మిగిలిన వాటిని పంపేసిన మీదట హసన్ తన అక్కలిచ్చిన బహుమానాలన్నీ పుచ్చు కుని, వారికి వీడ్కోలు చెప్పి, తన భార్య అయిన గంధర్వ చక్రవర్తి కుమార్తెతో సహా ఇంటికి బయలుదేరాడు. అతడి ప్రయాణం శరవేగంతో సాగి శీఘ్రంగానే ముగిసింది.



హసన్ బస్రా నగరంలో తన ఇంటి ముందు దిగుతూండగానే లోపలి నుంచి అతని తల్లి చేసే రోదనం వినిపించింది. అతను కూడా కన్నీరు కార్చుతూ తలవాకిలి తలుపు తట్టాడు. హసన్ తల్లి లేచి వచ్చి తలుపు తెరిచి, తన కొడుకును చూస్తూనే పెద్దగా నిట్టూర్చి మూర్ఛపోయింది.

హసన్ తన భార్యతో సహా తల్లికి ఉపచారాలు చేసి శీఘ్రంగానే స్పృహ కలిగించాడు. అతను తన భార్యను ఆమెకు పరిచయం చేశాడు. తన కోడలిని చూసుకుని ఆమె పరమానందం పొందింది. ఆ కోడలు గంధర్వ చక్రవర్తి కూతురని తెలిసి ఆమెకు మతిపోయినట్టయింది. ఇలాటి కోడలికి ఎలాటి మర్యాదలు జరపాలో కూడా ఆమెకు పాలుపోలేదు.

ఆవిడ అప్పుడే బయలుదేరి వెళ్ళి దుకాణాలలో ఉన్న బట్టలలోకెల్లా మేలయినవి పది ఏరి, కొని తెచ్చి, అన్నిటినీ ఒక్కసారే తన కోడలిపైన కప్పింది. తరవాత ఆమె తనకు తెలిసిన గొప్ప వంటకాలన్నీ చేసి స్వయంగా కోడలికి తినిపించింది.

చివరకు ఆమె తన కొడుకుతో, "నాయనా, నీ భార్య ఉండటానికి యీ బస్రానగరం ఎంతమాత్రమూ తగదురా. ఇక్కడ మనం పేదగా బతికిన వాళ్ళం కూడాను. అందుచేత మనం వెంటనే మకాం బాగ్దాదుకు మార్చి, గొప్ప అమీర్లమని చెప్పుకు బతుకుదాం," అన్నది.

ఈ ఆలోచన హసన్‌కు కూడా నచ్చింది. అతను తన ఇంటిని సామానుతో సహా విక్రయం చేసి, తన దగ్గిర ఉన్న డబ్బు సహాయంతో బాగ్దాదు చేరాడు. అతను నగరంలోకి వెళ్ళి దళార్ల ద్వారా ఒక దివ్యమైన భవనాన్ని లక్ష దీనార్లిచ్చి కొన్నాడు. ఆ ఇంటికి తగ్గట్టుగా సామగ్రి, అలంకరణలూ ఏర్పాటు చేసి, అందులో తన భార్యతోనూ, తల్లితోనూ ప్రవేశించాడు. అతను ఎంతమంది దాసదాసీలను

కొన్నాడంటే అతని పరివారాన్ని మించిన పరివారాలు బాగ్దాదులో ఎన్నో లేవు. అతను భోగభాగ్యాలతో తులతూగుతూ బాగ్దాదులో తొమ్మిది మాసాలు గడిపినాక అతని భార్య కవల పిల్లలను కన్నది. ఇద్దరూ మగబిడ్డలే, పున్నమి చంద్రుళ్ళ లాటి వాళ్ళు. వారికి నాసిర్, మన్సూర్ అని పేర్లు పెట్టుకున్నారు.

ఏడాది పూర్తి కాగానే హసన్ తన చిన్నక్కకు ఇచ్చిన మాట జ్ఞాపకం తెచ్చుకుని ప్రయాణ సన్నాహం సాగించాడు. తన అక్కలందరికీ కానుకలుగా ఇవ్వ దగిన వస్తువులు కొన్నాడు. తల్లితో తన ప్రయాణం గురించి చెప్పి, "అమ్మా, అన్నిటికన్న ముఖ్యమైన సంగతి విను. నీ కోడలి పక్షి తొడుగు రహస్యస్థలంలో దాచి ఉంచాను. నేను తిరిగి వచ్చేదాకా దాన్ని ప్రాణంతో సమంగా కాపాడాలి. నీ కోడలికి కొంత పక్షిస్వభావం ఉన్నది. పొరపాటునగాని ఆమె ఆ తొడుగును చూసిందో, మిగిలిన బంధాలన్నీ కూడా ఆమెను నివారించలేవు; ఆమెకు ఎగరా లన్న కాంక్ష ప్రబలంగా కలుగుతుంది. ఆమె వెళ్ళిపోతే మరి తిరిగి రాదు. ఆమె పోతే నేను మనోవ్యాధితో మరణించటం నిశ్చయం. నిత్య విషయాలలో కూడా ఆమెను శ్రద్ధగా చూసుకో. ఆమె గారాబంగా పెరిగినది, ఉపచారాలు మరిగినది. నేను చెప్పే ఈ విషయాలు పొరపాటున కూడా ఏమరవద్దు," అన్నాడు.





"నా కింతగా చెప్పాలా, నాయనా? వయసు వచ్చి నా బుద్ధి పెడతల పట్టిం దనుకున్నావా ఏం? నీవు నిశ్చింతగా వెళ్లిరా. నేను నీ భార్యను ఎలా చూసు కోవాలో అలా చూసుకుంటాను. నే నడిగే దల్లా ఒకటే: వీలయినంత త్వరగా మటుకు తిరిగి రా," అన్నది తల్లి.

అయితే, పాపం, రానున్నది వారిద్దరూ ఎరగరు. తమ సంభాషణను చక్రవర్తి కుమార్తె విన్న సంగతి కూడా వారికి తెలీదు.

హసన్ తన భార్యనూ, ఆమె వద్ద నున్న చంటి పిల్లలనూ ముద్దాడి ప్రయా ణమై వెళ్ళిపోయాడు.

అతను రాగానే గంధర్వ రాజకుమా ర్తెలు అంతులేని ఆనందం పొందారు. ముఖ్యంగా చిన్నక్క సంతోషం చెప్ప నలవి కాదు. ఆమె తమ భవనాన్ని పూల మాలలతోనూ, రంగు దీపాలతోనూ అలం కరించింది. హసన్ ఆమెతో తన కవల బిడ్డలను గురించి చెప్పాడు. తన అక్క లతో సరదాగా వేటకు వెళ్ళాడు. వారితో కలిసి వేడుకలన్నిటా పాల్గొన్నాడు.

హసన్ వెళ్ళినాక అతని భార్య రెండు రోజులపాటు అత్తగారిని అంటి పెట్టుకునే ఉంది. మూడోనాటి సూర్యోదయం వేళ ఆమె అత్తతో, "నాకు స్నానశాలకు వెళ్ళాలని ఉన్నది. మంచి స్నానం చేసి ఎంతో కాలమయింది," అన్నది.

"అవేం మాటలే పిల్లా? ఈ ఊరు మనకు కొత్తాయె. స్నానశాల ఎక్కడో కూడా తెలియదాయె. ముందుగా వెళ్ళి ఏర్పాట్లు చెయ్యటానికి మీ ఆయన కూడా లేడాయె. ముసలి దాన్ని. నీకు తోడు కూడా రాలేనైతిని. కావాలంటే సుఖంగా తలంటి స్నానం చెయ్యటానికి కావలిసిన సరంజామా అంతా ఏర్పాటు చేసి నీళ్ళు కాస్తాను. ఇంట్లోనే హాయిగా స్నానం చెయ్యి," అన్నది హసన్ తల్లి.

"స్నానశాలకు వెళ్ళటానికి కూడా అభ్యంతరమైతే ఎలాగత్తా? జానిసలకైనా

అన్ని కష్టాలు పడుతున్నావే! ఇలా బతికే కన్న చావు మేలుగదా!" అన్నది హసన్ భార్య.

తన కోడలు అంత మాట అన్నాక ముసలావిడ నొచ్చుకుని, స్నానానంతరం ధరించే బట్టలూ, పూసుకునే అత్తర్లూ తీసుకుని, "పదవే అమ్మాయ్! నీ యిష్ట ప్రకారమే కానియ్యి. మీ ఆయనకు కోపం రాకుండా చూసే భారం ఆ అల్లాదే!" అంటూ కోడల్ని వెంట బెట్టుకుని, బాగ్దాదు నగరంలో ఉండే స్నానశాల లన్నిటిలోకి ప్రసిద్ధమైన దానికి తీసుకు పోయింది.

హసన్ భార్య స్నానశాలలోకి అడుగు పెట్టగానే అక్కడ ఉన్న ఆడవాళ్ళందరూ ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచి ఆమె కేసే చూడసాగారు. కొందరు చేసే చేసే స్నానాలు కూడా మాని ఆమెను చూడ వచ్చారు.

ఇదే సమయంలో రాణి జుబేదా దాసి తూఫా అనే పిల్ల ఆ స్నానశాలలో ఉండటం తటస్థించింది. అది హసన్ భార్యను స్నానశాలలో ఉన్నంతసేపూ కన్నార్పకుండా చూడటమే గాక, ఆమె తన అత్తగారితో సహా వెళ్ళిపోయేటప్పుడు వారి ఇంటిదాకా వెంట వెళ్ళి, ఆ తరవాత ఖలీఫా భవనానికి తిరిగి వచ్చి జుబేదా రాణితో తాను చూసిన స్త్రీ అందాన్ని వైన వైనాలుగా వర్ణించి చెప్పింది.

తూఫా సంగతి జుబేదాకు తెలుసును. అది కనిపించిన అందగత్తెనల్లా అంత ఆత్రంగా మెచ్చుకోదు, ఎవరి అందం గురించీ అంత పారవశ్యంతో మాట్లాడదు. అందుచేత ఈ అపురూపపు సౌందర్యరాశిని స్వయంగా చూడాలని జుబేదాకు బలమైన కోరిక కలిగింది. ఆ సౌందర్యవతి పేరు తూఫాకు తెలియదు గాని, ఆమె ఫలానా భవనంలో ఉంటున్నదని అది చెప్పింది.

ఖలీఫాకు అంగరక్షకుడుగా ఉండే మస్రూర్‌ను పిలిచి జుబేదా, "ఫలానా భవనానికి వెళ్ళి, అందులో ఉంటున్న స్త్రీని వెంటబెట్టుకురా. ఒక్కడవే తిరిగి వచ్చావో నీ తల ఎగిరిపోతుంది," అన్నది.

—(ఇంకా వుంది)






# 6

రాణీ జుబేదా ఆజ్ఞమేరకు మస్రూర్ వెంటనే హసన్ ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు. హసన్ తల్లి తలుపు తెరిచి, మస్రూర్‌ను చూసి, ఏంకావాలని అడిగింది.

"నా పేరు మస్రూర్. నేను ఖలీఫా గారి అంగరక్షకుణ్ణి. ఈ ఇంట్లో ఉండే అమ్మాయిని తీసుకురమ్మని మా రాణిగారి ఉత్తరువు!" అన్నాడు మస్రూర్.

హసన్ తల్లికి భయం పట్టుకున్నది. ఆమె కంపించిపోతూ, "నాయనా, మస్రూర్, మేము ఈ ఊరికి కొత్తవాళ్ళం. నా కొడుకు ప్రయాణం మీద వెళ్ళాడు. వెళుతూ తన భార్యను గడపదాటి వెళ్ళనివ్వవద్దని మరీ మరీ చెప్పాడు. అది బయటికి వెళ్ళితే ఏదో కీడు మూడుతుంది. దానికేదైనా జరిగిందో మా వాడు బతకలేడు. ఏం జేతును?" అన్నది.

"ఏమీ భయం లేదమ్మా! మా రాణిగారు మీ కోడలి అందచందాలు విని చూద్దామనే ఉద్దేశంతో పిలిపిస్తున్నారు. ఆ పిల్ల కేమీ రాకుండా నేను లేనా? క్షేమంగా తీసుకుపోయి క్షేమంగా తెస్తాను. ఇలా ఎంతమందిని తీసుకుపోయి ఇళ్ళ దగ్గిర దిగబెట్టాను కాను?" అన్నాడు మస్రూర్.

పరిస్థితి అనివార్యమైనదని హసన్ తల్లి గ్రహించింది. ఆమె లోపలికి వెళ్ళి తన కోడలికీ, మనమలకూ మంచి దుస్తులు వేసి అలంకరించింది. ఆ తరవాత వాళ్లతో బాటు తాను కూడా మస్రూర్ వెంట ఖలీఫా మందిరానికి బయలుదేరింది.

వారు వచ్చి చేరేసరికి రాణి జుబేదా సింహాసనం మీద కూచుని ఉంది. ఆమె చుట్టూ అనేకమంది దాసీలున్నారు.



జుబేదా తననుతానే మరచిపోయి, సింహాసనం మీది నుంచి లేచి, హసన్ భార్యను ఆలింగనం చేసుకున్నది. తరవాత ఆమెను సింహాసనం మీద కూర్చోబెట్టుకుని, తన మెడలోని పదిపేటల ముత్యాల హారాన్ని ఆమె మెడలో వేసింది. ఆ ముత్యాలహారం, ఖలీఫాను పెళ్ళాడిన నాటినుంచి జుబేదా మెడను అలంకరిస్తూ వచ్చింది.

''అమ్మాయీ, నీకు ఆటలూ, పాటలూ, నృత్యాలూ తెలుసునా? నీవంటిదానికి అవి తెలియకుండా ఉండవులే!'' అన్నది జుబేదా రాణి.

వారిలో తూఫా కూడా ఉన్నది. జుబేదా హసన్ భార్యతో, ''రా, అమ్మాయ్! ఇక్కడ మగవారెవరూ లేరులే. నీ మేలి ముసుగు తీసెయ్యవచ్చు.'' అంటూ తూఫా కేసి చూసింది. తూఫా ముందుకు వచ్చి, హసన్ భార్య ధరించిన మేలి ముసుగును ఎంతో భక్తితో తీసివేసింది. గంధర్వ చక్రవర్తి కుమార్తె ముఖం మబ్బులచాటు నుంచి బయటికి వచ్చిన పౌర్ణమి చంద్రబింబం లాగా ప్రకాశించింది. జుబేదా దాసీలు ఒక్కసారిగా ఆశ్చర్యంతో ఊపిరిపీల్చటం మరిచిపోయి, ''ఏమిటీ అందం!'' అని తమలోతాము గుసగుసలాడుకున్నారు.

''సాధారణంగా ఆడపిల్లలు నేర్చుకునే పాటలూ, నృత్యాలూ లాటివి నా కేమీ రావు. కాని మీకు ఆశ్చర్యం కలిగించే విద్య ఒకటి నాకు తెలుసును—నేను పక్షి లాగా ఎగరగలను!'' అన్నది హసన్ భార్య.

''అద్భుతం! ఆశ్చర్యం!!'' అన్నారు దాసీలంతా.

''రెక్కలు లేకుండా ఎలా ఎగురుతావు? ఒక్కసారి ఎగిరి చూపిస్తావా?'' అని జుబేదా అడిగింది.

''రెక్కలు లేకపోవడమేమిటి? నాకు పక్షితొడుగొకటి ఉన్నది. మా అత్తగారిని పంపితే ఆ తొడుగు తెస్తారు.'' అన్నది హసన్ భార్య.

జుబేదా ముసలావిడతో, "అమ్మా, ఆ పక్షితొడుగుట, తెస్తారా? మీ కోడలు ఎగిరితే చూసి ఆనందిస్తాం," అన్నది.

హసన్ తల్లి గుండెల్లో రాయి పడింది. ఇక తమను అల్లా మాత్రమే రక్షించగలడని మనసులో అనుకుని ఆమె జుబేదాతో, "మనుషులెవరైనా పక్షితొడుగులు తొడుగుతారా? ఏలినవారి సమక్షంలో నా కోడలు మతిచలించి మాట్లాడుతున్నది. అంతకంటె ఇంకేమీ లేదు," అన్నది.



కాని హసన్ భార్య ఆమెకు అడ్డువచ్చి, "నేను చెప్పిన పక్షితొడుగు మా ఇంట ఎక్కడో భద్రంగా దాచి ఉన్నది. సరిగా వెతికితే కనిపించి తీరుతుంది," అన్నది.

జుబేదా వెలలేని తన చేతి ఆభరణం తీసి ముసలిదానికిస్తూ, "అమ్మా, ఆ తొడుగు తీసుకురావాలి. లేకపోతే నాపైన ఒట్టు! ఎంతసేపు? ఒక్కక్షణం సేపు ఆనందించి ఆ తొడుగు మళ్ళీ మీకే ఇచ్చేస్తాను," అన్నది. కాని హసన్ తల్లి తనకా తొడుగు సంగతి తెలియదంటే తెలియదని మూర్ఖించేసరికి జుబేదాకు కోపం వచ్చింది. ఆమె మస్రూర్‌ను పిలిచి, హసన్ ఇల్లంతా గాలించి పక్షితొడుగు ఎక్కడ ఉన్నా వెతికి తీసుకురమ్మని ఆజ్ఞాపించింది. ఇంటి తాళపుచెవులను ముసలావిడ చేత మస్రూర్‌కు ఇప్పించింది.

మస్రూర్ ఇల్లంతా శోధించి చివరకు పక్షితొడుగు సంపాదించి, తెచ్చి జుబేదాకిచ్చాడు. జుబేదా దాన్ని కొంచెంసేపు పరీక్షించి, దానిలోని పనితనాన్ని చూసి ఆశ్చర్యపడి, దాన్ని హసన్ భార్య కిచ్చేసింది. ఆమె దాన్ని అందుకుని, ప్రతి ఈకా పరీక్షించి, తొడుగు చెక్కుచెదరకుండా ఉన్నందుకు సంతోషించి దానిని ధరించింది. తరవాత ఆమె తేలికగా గాలిలోకిలేచి మంటపం ఈ చివరనుంచి ఆ చివరకు ఎగిరివచ్చి నేల మీద వాలింది. ఆమె తన ఇద్దరు కొడుకులనూ తీసుకుని చెరొక భుజానా పెట్టుకుని ఎత్తుగా ఉన్న గవాక్షానికి ఎగిరి, అక్కడ వాలి, "నేను



పోతున్నాను, నాకు సెలవిప్పించండి,'' అన్నది. హసన్ తల్లి తివాసీ మీద కుప్ప కూలిపోయి కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తున్నది. కోడలు ఆమెతో, ''అత్తా, నేను మిమ్మల్నీ, మీ అబ్బాయినీ వదిలి వెళ్ళిపోతున్నాను. మిమ్మల్ని గురించి నాకు బాధగానే ఉంది. కాని ఏం చెయ్యను! ఎగరటంలో ఉన్న నిషా నన్ను ఆవహించేసింది. నేను ఎగిరి తీరాలి. మీ అబ్బాయి నన్ను వెతకదలిస్తే వాక్-వాక్ దీవులలో వెతకవచ్చు. సెలవు!'' అంటూ గవాక్షంకుండా తన పిల్లలతో సహా ఆకాశంలోకి ఎగిరిపోయింది. స్పృహ తప్పి పడి ఉన్న హసన్ తల్లిని జుబేదా చేత్తో తాకిలేపి, ''అమ్మా, అసలు ఏమీ తెలియనట్టు నటించకపోతే, పర్యవసానం ఇలా అవుతుందని చెప్పి ఉండరాదా? ఇంత దాకా రానివ్వకపోదునే! తెలియక చేసిన ఈ పొరపాటును క్షమించాలి,'' అన్నది.

''తప్పంతా నాదే, తమరిని నేను క్షమించటమేమిటి? నేనూ, నా కొడుకూ దుఃఖంతో కుమిలి చావాలని రాసిపెట్టి ఉన్నది, ఇంతకూ!'' అంటూ హసన్ తల్లి తన ఇంటికి కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళిపోయింది. ఒక వేళ తన కోడలూ, మనవలూ కనిపిస్తారేమోనన్న భ్రమతో ఇల్లంతా వెతికింది. కాని వారెందుకు కనిపిస్తారు? ఆమె ఒక పెద్ద సమాధీ, రెండు చిన్న సమాధులూ ఇంట్లో కట్టించి వాటి చెంతనే అహోరాత్రాలు ఏడుస్తూ కొనప్రాణంతో ఉండిపోయింది.

అక్కడ హసన్ ఏడుగురు రాజకుమార్తెలతో మూడు నెలలు గడిపి, తన కోసం తన భార్యా, తల్లీ నిరీక్షిస్తూ ఉంటారనే బెంగతో తన ''అక్కలకు'' వీడ్కోలు చెప్పి, డప్పు మోగించి, ఒంటెలను రప్పించి, రాజకుమార్తెలిచ్చిన బంగారమూ, వెండీ, రత్నాలూ వాటిపైన పెట్టించి, త్వరలోనే బగ్దాదునగరానికి తిరిగి వచ్చాడు.

అతను ఇంట్లో ప్రవేశించి తన తల్లిని గుర్తించలేకపోయాడు. తరవాత ఆమెను, "నా భార్య ఏదీ? పిల్లలేరీ?" అని అడిగాడు. ఈ ప్రశ్నకు జవాబుగా తల్లి పెద్ద పెట్టున ఏడవసాగింది. హసన్‌కు మతిపోయినట్టయింది. అతను ఇల్లంతా గాలించటంలో, తన భార్య తాలూకు పక్షి తొడుకు దాచి ఉంచిన పెట్టె ఖాళీగా కనిపించింది. మూడు కొత్త సమాధులు కనిపించాయి. వాటిని చూస్తూనే అతను ఒక్క కేక పెట్టి విరుచుకు పడిపోయాడు.

తల్లి ఎన్ని ఉపచారాలు చేసినా హసన్‌కు రాత్రి పడినదాకా తెలివిరాలేదు. తెలివి వచ్చాక అతను తన బట్టలు చించుకున్నాడు. నెత్తిన దుమ్మూ, బూడిదా చల్లుకున్నాడు. కత్తితో పొడుచుకుని చావ యత్నించాడు—కాని తల్లి అడ్డు పడింది. ఆమె అతన్ని చిన్న పిల్లవాణ్ణి పొదివినట్టుగా దగ్గరికి తీసుకుని, జరిగినదంతా చెప్పి, "నాయనా, నువు బొత్తిగా నిరాశ పొందనవసరం లేదు. వాక్ - వాక్ దీవులకు వెళితే నీ భార్య దొరకవచ్చు," అన్నది.

ఈ మాట వింటూనే హసన్‌కు కొత్త ప్రాణం వచ్చినట్టయింది. అతను చివాలున లేచి నిలబడుతూ, "అమ్మా, నేనిప్పుడే వాక్ - వాక్ దీవులకు ప్రయాణమవుతున్నాను," అన్నాడు.

కాని పక్షికూతలాంటి పేరుగల దీవులు ఎక్కడ ఉంటాయి? వీటికోసం ఇండియా వెళ్ళాలా? పర్షియా వెళ్ళాలా? చీనా వెళ్ళాలా? అతనికేమీ తెలియదు.

అతను తిన్నగా ఖలీఫాగారి దర్బారుకు వెళ్ళి అక్కడ ఉన్న పండితు లందరినీ వాక్-వాక్ దీవులు ఏ సముద్రంలో ఉంటాయని అడిగాడు. కాని ఒక్కరికీ తెలియదు. ఒక్కరైనా ఆ దీవులను గురించి విని ఉండలేదు. అతనిలో మొలకెత్తిన ఆశ అంతలోనే నశించిపోయింది. "ఇంక నేను పోయేది ఏకంగా పితృలోకానికే!" అనుకుంటూ అతను ఇంటికి వెళ్ళి పడుకున్నాడు. —(ఇంకా వుంది)





# గంధర్వ చక్రవర్తి కూతురు

## 7

నిరాశతో ఇంటికి వెళ్లిన హసన్‌కు అంతలోనే మళ్ళీ కొత్త ఆశ చిగిర్చింది — అతనికి రాజకుమార్తెలు జ్ఞాపకం వచ్చారు. అతను తల్లికి మళ్ళీ వీడ్కోలు చెప్పి ఒంటెను పిలిచి దానిపై తన అక్కల వద్దకు బయలుదేరి వెళ్లాడు. అతను అంత త్వరగా తిరిగి వచ్చినందుకు వాళ్ళు పరమానందం చెందారు. అతను వారితో జరిగినదంతా చెప్పి శోకంతో వివశుడైపోయాడు. వారు అతన్ని ఊరడించారు.

"వాక్–వాక్ దీవులకు వెళ్లే మార్గం నాకు చెప్పండి. అక్కడ విచారిస్తే తన జాడ తెలుస్తుందని నా భార్య వెళ్ళిపోయేటప్పుడు చెప్పిందట," అన్నాడు హసన్.

ఏడుగురు అప్పచెల్లెళ్లూ ముఖముఖాలు చూసుకుని తలలు పంచుకున్నారు. చివరకు వారు, "హసన్, చెయ్యి ఎత్తి స్వర్గాన్ని తాకటమైనా నీకు సాధ్యమవుతుందేమో గాని, వాక్ - వాక్ దీవులకు వెళ్ళటం సాధ్యం కాదు," అన్నారు. హసన్ పెట్టుకున్న ఆశలన్నీ అడుగంటిపోయాయి. దుఃఖావేశం ముంచుకొచ్చింది.

అతన్ని పెంచుకున్న ఆఖరు రాజకుమార్తె ఊరడించి, "నీకు నీ భార్యాబిడ్డలూ దక్కే యోగం ఉంటే ఏదో ఒక ఉపాయం దొరకకపోదు. హసన్, మేము మాకు చేతనయినదంతా చేస్తాము గాని చేతులు కట్టుకు కూర్చోము, దిగులు పడకు," అని ధైర్యం చెప్పింది.

ఈ రాజకుమార్తెలకు అబ్దల్ కద్దూస్ అని ఒక మేనమామ ఉన్నాడు. ఆయన ఏడాదికొకసారి తన మేనగోడళ్లను చూడ




వస్తాడు. ఆయనను అవసరంపడి పిలవాలంటే ఒక రకమైన గుగ్గిలం నిప్పులో వెయ్యాలి. ఆ గుగ్గిలం పెద్ద రాజకుమార్తె వద్ద ఉన్నది. దానిని కొంచెం తీసి నిప్పుల మీద వెయ్యగానే పెద్ద సుడిగాలి వీచింది. అది అణగారి పోగానే తెల్ల ఏనుగు నెక్కి అబ్దల్ కద్దూస్ చక్కా వచ్చాడు.

''నేను వచ్చి ఏడాది అయింది. రేపు బయలుదేరి వద్దామనే అనుకుంటున్నాను. ఇంతలో మీరే పిలిపించారు. ఏదో విశేషం ఉండాలి, ఏమిటది?'' అని ఆయన తన మేనగోడళ్ల నడిగాడు.

''మరేం లేదు. నీవల్ల మాకొక సహాయం కావాలి,'' అన్నారు రాజకుమార్తెలు.

''ఇచ్చేశాను! ఏమిటా సహాయం?'' అన్నాడాయన. వారు ఆయనకు హసన్ కథ అంతా వివరంగా చెప్పి, ''మా తమ్ముడు హసన్ వాక్-వాక్ దీవులకు వెళ్ళే మార్గం నువు చెప్పాలి,'' అన్నారు.

ఆయన మూతి మీద వేలు వేసుకుని, తల వంచి దీర్ఘాలోచన చేసి, ఏమేమిటో గుణించుకుని చివరకు, ''లాభం లేదు. మీ తమ్ముడు అసాధ్యం తలపెట్టాడు. అతను వాక్-వాక్ దీవులు చేరటం అసంభవం,'' అనేశాడు.

''ఈ మాట అతని బుద్ధికి అంటేలాగు చెప్పు. నీ సలహా కూడా ఇయ్యి,'' అన్నారు రాజకుమార్తెలు.

అబ్దల్ కద్దూస్ హసన్‌తో, ''నాయనా, తోకచుక్కలూ, సంచార గ్రహాలూ కూడా నిన్ను వాక్-వాక్ దీవులకు చేర్చలేవు. ఆ దీవులలో గంధర్వ చక్రవర్తి భద్రుడై ఉంటాడు. ఆ దీవులను సైనికకన్యల ముఠాలు కాపాడుతూ ఉంటాయి. సప్త సముద్రాలూ, సప్తనగాలూ దాటితేనేగాని ఆ దీవులను చేరలేవు. అక్కడికి వెళ్లటం నీకు అసాధ్యం. అందుచేత ఆ ప్రయత్నం మాని నీ అక్కలతో సుఖంగా కాలక్షేపం చేస్తూ ఇక్కడే ఉండిపో! లేనిపోని ప్రమాదాలెందుకు కొని తెచ్చుకుంటావు?'' అని హితం చెప్పాడు.

ఈ మాటలు విని హసన్ ముఖం పాలిపోయింది. అతను పెద్ద పెట్టున కేక వేసి విరుచుకు పడిపోయాడు. అతన్ని చూసి అబ్దల్ కద్దూస్‌కు జాలికలిగింది. హసన్‌కు స్పృహ తెలియగానే ఆయన అతని భుజం మీద చెయ్యి వేసి, "నీ సంగతి ఇలా వదిలెయ్యటం నాకే బాగా లేదు. ఏదైనా దారి ఉందేమో చూస్తాం, నా వెంట వస్తావా?" అని అడిగాడు.



హసన్‌కు మళ్ళీ ప్రాణం వచ్చినట్టయింది. అతను ఎగిరి గంతేసి ముసలాయనను వెంబడించాడు. ఇద్దరూ తెల్ల ఏనుగు పైకెక్కి కూచున్నారు. కద్దూస్ దాని చెవిలో ఏదో చెప్పాడు. వెంటనే ఏనుగు గాలిలోకి లేచి, అద్భుత వేగంతో ప్రయాణించి, నీలిపర్వతం చేరుకున్నది. నీలి పర్వతంలో ఒక గుహా, దానికి నీలం రంగుగల ఉక్కు తలుపూ ఉన్నాయి. వృద్ధుడీ తలుపు తట్టగానే నీలచ్ఛాయగల ఒక నీగ్రో, నీలి ఖడ్గమూ, నీలి డాలూ పట్టుకుని వచ్చాడు. వృద్ధుడు రెప్పపాటులో వాడి కత్తీ, డాలూ లాగేసి అవతల పారేశాడు. వెంటనే నీగ్రోవాడు వారికి దారి ఇచ్చాడు. ఇద్దరూ గుహలో ప్రవేశించినాక వాడు తలుపు మూశాడు.

గుహ మార్గంకుండా వారు ఒక మైలు దూరం నడిచాక రెండు వాకిళ్ళు కనిపించాయి. రెంటికీ బంగారు తలుపులున్నాయి. అబ్దల్ కద్దూస్ ఒక వాకిలి తలుపులు తోసి లోపలికి వెళ్ళిపోయాడు. ఆయన ఆదేశానుసారం హసన్ వెలపలనే ఉండిపోయాడు.

ఒక గంట గడిచాక ఆయన ఒక గుర్రాన్ని వెంట పెట్టుకుని బయటికి వచ్చాడు. గుర్రమూ, దాని జూలూ కూడా నీలంగానే ఉన్నాయి. ఆయన హసన్‌ను ఆ గుర్రం ఎక్కమని రెండవ ద్వారం తెరిచాడు. ఆ ద్వారం అవతల నీలాకాశం తప్ప మరేమీలేదు.

"నాయనా, ఆఖరుసారి ఆలోచించి నిర్ణయించుకో. నీకు ఘోర ప్రమాదాలు



ఎదురవుతాయి. వాటిని ఎదుర్కుంటావా? లేక మీ అక్కల దగ్గిరికి తిరిగి వెళ్ళిపోతావా ?'' అని ఆయన హసన్‌ను అడిగాడు.

''వెయ్యి మరణాలనైనా ఎదుర్కుంటాను,'' అన్నాడు హసన్.

''కని పెంచిన మీ అమ్మకోసమైనా వెనక్కు తిరిగి వెళ్ళవా ?'' అని వృద్ధుడు అడిగాడు.

''నా భార్యనూ, పిల్లలనూ వెంట తీసుకోకుండా మా అమ్మ వద్దకు తిరిగి వెళ్ళను,'' అన్నాడు హసన్.

''అలాగే కానీ, హసన్. ఈ ఉత్తరం తీసుకో. గుర్రాన్ని నీవు నడపనవసరం లేదు, దానికి దారి తెలుసు. అది నిన్ను నల్ల పర్వతం వద్ద దించుతుంది. నల్ల గుహవద్ద దిగి గుర్రాన్ని గుహలోకి వెళ్ళిపోనియ్యి. ఒక వృద్ధుడు బయటికి వస్తాడు. ఆయన నిలువుగా నల్లగా ఉంటాడు. కాని మోకాళ్ళదాకా పెరిగిన తెల్లటి గడ్డం ఉంటుంది. ఆయనకు వందనం చేసి ఈ ఉత్తరం ఇయ్యి. ఆయన పక్షులకు రాజు, నాకు పైవాడు. ఆయన సహాయం లేకుండా నీ పని సానుకూలం కావటం అసంభవం. ఆయన మెప్పు పొందు,'' అని అబ్దుల్ కద్దూస్ గుహ ప్రవేశించాడు. నీలం గుర్రం గట్టిగా సకిలించి ఆకాశంలోకి ఎగిరింది.

అబ్దుల్ కద్దూస్ ఇచ్చిన నీలిగుర్రం ఎక్కి హసన్ పగ్గాలు వదిలేశాడు. అప్పుడా గుర్రం బాణం లాగా సూటిగానూ, అతి వేగంగానూ ప్రయాణిస్తూ పది రోజుల కాలంలో పది సంవత్సరాల నడక ముగించి ఒక నల్లని పర్వత పంక్తిని చేరుకున్నది. ఆ పర్వత పంక్తి తూర్పు పడమరలుగా వ్యాపించి వున్నది. నీలి గుర్రం గట్టిగా సకిలించి పర్వతాల మీద దిగగానే ఎక్కడినుంచో నల్లని గుర్రాలు వేనకువేలుగా వచ్చి నీలిగుర్రాన్ని చుట్టుముట్టాయి. నీలిగుర్రం వాటి మధ్యగా వెళ్ళి ఒక నల్లని గుహను సమీపించింది.

గుహ వెలుపల హసన్‌ను దించి అది గుహలోకి వెళ్ళిపోయింది.

గుహ వెలుపల హసన్ ఒక గంటసేపు కాచుకున్నాక ఒక గౌరవనీయుడైన వృద్ధుడు గుహ నుంచి వెలికి వచ్చాడు. అతను కారునలుపుగా ఉండటమే గాక నల్లని దుస్తులు కూడా ధరించాడు. నడుము కిందికి వేళ్ళాడే ఆయన గడ్డం మటుకు తెల్లగా ఉన్నది. ఈయన సాక్షాత్తూ సులేమాన్ కొడుకైన అలీ. హసన్ ఆయన ముందు భక్తిగా మోకరించాడు. తరవాత ఆయనకు అబ్దల్ కద్దూస్ రాసిన ఉత్తరం అందించాడు. అలీ ఆ ఉత్తరాన్ని మౌనంగా తీసుకుని గుహలోకి వెళ్ళిపోయాడు.

ఎంతోసేపు గడిచింది. హసన్ నిరాశ చెందుతూండగా వృద్ధుడు తెల్ల దుస్తులు ధరించి గుహలో నుంచి వచ్చి, లోపలికి రమ్మని సైగచేసి, తనతోబాటు అతన్ని గుహ లోపల ఉన్న ఒక సావడిలోకి తీసుకువెళ్ళాడు. అది రత్నాలు పొదిగిన సావడి. దాని నాలుగు మూలలా తివాసీలపై నలుగురు జ్ఞానులు కూచుని ఉన్నారు. వారి పక్కన గ్రంథాలు దొంతరలు దొంతరలుగా పేర్చి ఉన్నాయి. సావడి మధ్య వృద్ధుడి శిష్యులు ఏడుగురున్నారు. వారు ఏమేమో రాస్తున్నారు.

అలీ రాగానే అందరూ లేచి, ఆయన సావడి మధ్య కూచోగానే అందరూ ఆయనను పరివేష్ఠించి కూచున్నారు. అప్పుడు హసన్ వారందరికీ తన కథ అంతా చెప్పాడు. తరవాత అందరూ చర్చించి హసన్‌కు సహాయం చెయ్యటమే ఉచితమని వృద్ధుడికి సలహా యిచ్చారు.

వారి సలహా విని ఆయన, ''నిజమే కాని వాక్-వాక్ దీవులకు వెళ్ళటం తేలిక కాదు. తిరిగిరావటం మరింత కష్టం. యోధకన్యల నుంచి అతనికి రాగల అపాయం మాట చెప్పనే అవసరం లేదు. ఈ కుర్రవాడు తన భార్యను ఎలా కలుసుకోగలుగుతాడో నాకు అర్థం కావటంలేదు.'' అన్నాడు. —(ఇంకా వుంది)





# గంధర్వ చక్రవర్తి కూతురు

## 8

వృద్ధుడి మాటలతో మరింత దుఃఖపడి పోతూ హసన్ అయన కాళ్ళపై పడి తనకు భార్యాదానమూ, పుత్రదానమూ చెయ్యమని ప్రార్థించాడు.

"చావటానికి నీలాగా ఆత్రపడేవాణ్ణి నేనెక్కడా చూడలేదు. నీవు తలపెట్టిన పని ఎంత ప్రమాదకరమైనదీ నీకు కొంచెం కూడా తెలియదు. అయినప్పటికీ నా చేతిలో ఉన్న సహాయమంతా నేను చేస్తాను," అంటూ వృద్ధుడు తన గడ్డం నుంచి కొన్ని వెంట్రుకలు పీకి హసన్ కిచ్చి, "నీకు ప్రాణం మీదికి వచ్చినప్పుడు ఈ వెంట్రుకలలో ఒకటి తీసి కాల్చి నట్టయితే నేను తక్షణం వచ్చి నీకు సహాయం చేస్తాను," అన్నాడు.

తరవాత అయన తల ఎత్తి పైకి చూసి చప్పట్లు చరిచాడు. వెంటనే ఒక భూతం వారి ఎదట ప్రత్యక్షమయింది. వృద్ధుడు హసన్‌తో, "వీడి వీపు మీద సవారీ అయి వెళ్ళు. వీడు నిన్ను కర్పూరద్వీపం మీద దించుతాడు. ఆపైన నీ దారి నీవే చూసుకోవాలి. కర్పూరద్వీపం గడిచి అవతలి చివరకు వెళ్ళితే వాక్-వాక్ దీవులుండే సముద్రం యొక్క ఇవతలి తీరం చేరుకుంటావు. ఆ తరవాత భగవంతుడే ఉన్నాడు," అన్నాడు.

హసన్ వృద్ధుడికీ, మిగిలినవారికీ నమస్కారాలు పెట్టి భూతం వీపు మీద ఎక్కి కూచున్నాడు. భూతం ఆకాశ మార్గాన ప్రయాణించి అతన్ని కర్పూర ద్వీపం మీద దించి తన దారిన తాను వెళ్ళిపోయింది. నిగనిగా మెరుస్తూ, సువాసన వెదజల్లే ఆ కర్పూరద్వీప మైదానం మీద పడి హసన్ నడవసాగాడు.



కొంతదూరం వెళ్ళేసరికి అంతదూరాన అతని కొక గుడారు లాటిది కనబడింది. ఎత్తయిన గడ్డి మధ్యగా అతను దాని కేసి నడుస్తూ, కాలికి ఏదోతగిలి పడిపోయాడు.

హసన్‌కు తగిలినది ఒక మహాకాయుడి శరీరం. అతనికి గుడారం లాగా కనిపించి నది ఆ మహాకాయుడి చెవి. ఆ మహాకాయుడు నిద్రపోతూ, హసన్ తన పైన పడగానే పెద్ద పెడ బొబ్బపెట్టి తాటిచెట్టు ప్రమాణాన లేచి నిలబడి, హసన్‌ను పిచ్చి కను పట్టుకున్నట్టు పట్టుకుని పైకెత్తాడు.

హసన్ భయంతో గిలగిలా కొట్టుకుంటూ, "రక్షించండి! కాపాడండి!" అని పెద్దగా కేకలు పెట్టాడు.

"ఈ పక్షి చిత్రంగా కూస్తుందే! దీన్ని మా రాజుగారికి బహుమానం ఇస్తాను," అనుకున్నాడు మహాకాయుడు.

కర్పూరద్వీపపు రాజు ఒక రాతి మీద కూచుని ఉన్నాడు. ఆయన కూడా హసన్‌ను చూసి ఏదో పిట్ట అనీ, "రక్షించండి! కాపాడండి!" అని అతను అరిచే అరుపులు కూత అనీ అనుకుని చాలా ముచ్చటపడ్డాడు. ఆయన ఒక పంజరంలో హసన్‌ను పెట్టి అతనికి నీరూ, ఆహారమూ యిస్తూ, తన ఇంట వేళ్ళాడగట్టాడు.

రోజులు గడిచాయి. హసన్ పంజరంలో చిక్కి పాలిపోయి నీరసించసాగాడు. చివరకు అతనికి ప్రాణాపాయ స్థితి కూడా ఏర్పడింది. ఆ స్థితిలో అతనికి వృద్ధుడి వెంట్రుకలు జ్ఞాపకం వచ్చాయి. రాజు కూతురు అతన్ని ఆడించటానికి పంజరంలో నుంచి బయటికి తీసినప్పుడు అతను ఆమె పట్టు తప్పించుకుని వెళ్ళి వృద్ధుడి వెంట్రుక ఒకటి కాల్చాడు.

వెంటనే వృద్ధుడు ప్రత్యక్షమై, "ఏం కావాలి, హసన్?" అని అడిగాడు.

"నన్నిక్కడి నుంచి మరెక్కడికైనా చేర్చండి. ఇంకొక్క రోజు గడిస్తే నా ప్రాణాలు దక్కేలాగు లేవు," అన్నాడు హసన్ దీనంగా.

"నేను చెప్పాను కానా? ఇంకా అవగింజలో అర భాగం కాలేదు. ఇక్కడ గనక నా వెంట్రుక కాల్చి నన్ను పిలవ గలిగావు. వాక్-వాక్ దీవులలో ఏ ఇతర మంత్రాలూ, తంత్రాలూ పారవు. అక్కడ నీకు భగవంతుడే దిక్కు. నీవీ ప్రయత్నం ఏనాడో మాని ఉండవలిసింది" అన్నాడు వృద్ధుడు.

"నా ప్రయత్నంలో చస్తే చస్తాను. దానికి నేను సిద్ధంగానే ఉన్నాను. చావు అన్నది రాసి పెట్టి ఉన్నప్పుడే వస్తుంది గాని ముందే వచ్చెయ్యదు గదా! నా భార్య కోసం వెళ్ళటం ఎలా మానుకుంటాను? దయచేసి నాకు ముందు దారి చెప్పండి." అన్నాడు హసన్.

వృద్ధుడు హసన్ చెయ్యి పట్టుకుని, "నీ కళ్ళు ఒక్కసారి మూసి తెరు," అన్నాడు. హసన్ కళ్ళు మూసి తెరిచే సరికి అతను ఒక సముద్రం ఒడ్డున ఉన్నాడు. వృద్ధుడి జాడ లేదు. అతను నిలబడిన తీరాన అనేక రంగుల రత్నాలున్నాయి.

అతను ఒక్కసారి చుట్టూ కలయ చూశాడో లేదో, సముద్ర తీరాన ఉండే కొండల మీది నుంచి పెద్ద ఆకారం గల పక్షులు, "వాక్-వాక్" అని అరుస్తూ తూగిడీలు తూగిడీలుగా లేచాయి.



తానున్నది వాక్-వాక్ దీవులలో చేరినదేనని హసన్ గ్రహించాడు. ఈ పక్షులు తనను సముద్రంలోకి తోసేలోపునే ఎక్కడైనా దాక్కోవాలని చూసేసరికి అతని అదృష్టవశాత్తూ దగ్గిరలోనే ఒక గుడిసె కనిపించింది. కాని అంతలోనే భూమి దద్దరిల్లింది. అంత దూరాన ధూళి లేచింది. ఆ ధూళి మేఘం తానున్నవేపే వస్తున్నది. త్వరలోనే అతనికి ఆ మేఘంలో మెరుపుల్లాగా ఈటెల కొసలూ, శిరస్త్రాణాలూ, కవచాలూ కనిపించాయి. ఆ వచ్చేది భయంకరమైన యోధకన్యలు!

వారు పెద్ద పెద్ద గుర్రాలెక్కి, కత్తులు ధరించి, వాయువేగంతో అతనున్న చోటికి



వచ్చారు. వారి నుంచి హసన్ తప్పించుకుపోయే మార్గం లేదు. అతను గుడిసె వాకిట నిలబడ్డాడు. అతన్ని చూడగానే గుర్రాలన్నీ నిలిచిపోయాయి. యోధకన్యలలో ఒకతె తన గుర్రాన్ని హసన్ సమీపానికి నడిపించుకుంటూ వచ్చింది. ఆమె ముఖానికి కూడా కవచం ఉండటం చేత దాన్ని అతను చూడలేకపోయాడు. ఆమె ఏమీ అనక ముందే అతను నేలపై ఆమె ముందు సాష్టాంగపడి, "దేవీ, నేను విధి వశాన ఈ దీవికి వచ్చాను. నీ శరణు జొచ్చాను. భార్యనూ, బిడ్డలనూ వెతుక్కుంటూ వచ్చిన ఈ నిర్భాగ్యుడిపై దయతలిచి అభయం ఇయ్యి," అన్నాడు.

ఆమె తన గుర్రం మీది నుంచి దిగి, ఒక్క చేతి ఊపుతో తన అనుచరులను పంపేసి, అతని కేసి పరీక్షగా చూసి, తన ముఖానికి అడ్డంగా ఉన్న కవచభాగాన్ని తొలగించింది. ఆమె ముఖం చూసి భయపడి హసన్ కెవ్వున అరిచాడు. యోధ కన్యలు చాలా అందకత్తెలని ప్రతీతి. ఈమె ఎంతో ముసలిదే కాక అందవికారంగానూ, భయంకరంగానూ ఉన్నది.

తనను చూసి హసన్ కళ్ళు మూసుకున్నది భయంతోనని తెలియక, తనపై గల గౌరవం కొద్దీ అనుకుని ముసలిది "భయపడకు, నాయనా! నిన్ను నేను రక్షిస్తాను. నీకు కావలిసిన సహాయమంతా చేస్తాను. కాని ముందు నిన్నెవరూ చూడకుండా చూడాలి. అందుచేత నీకు యోధకన్య దుస్తులు తెచ్చి యిస్తాను. వాటిని ధరించు. ఆ తరవాత నీ కథ సావధానంగా వింటాను," అన్నది.

ఆమె వెళ్ళి త్వరలోనే యోధకన్యలు ధరించే కవచాలూ మొదలైన వాటితోనూ, ఆయుధాలతోనూ తిరిగి వచ్చింది. అవన్నీ ధరిస్తే హసన్ కూడా యోధ కన్యలాగే ఉన్నాడు. ముసలిది అతన్ని సముద్ర తీరాన ఉన్న ఒక రాతిపై కూచోబెట్టి, తాను కూడా కూచుని అతని కథ అంతా సమగ్రంగా విన్నది. విని అతని భార్య

పేరూ, కుమాళ్ల పేర్లూ అడిగింది. అతను వారి పేర్లు చెప్పి, ''వాళ్ళనిక్కడ ఏ పేర్లతో పిలుస్తారో తెలియదు,'' అన్నాడు.

ముసలిదానికి హసన్‌పై మాతృప్రేమ పుట్టుకొచ్చింది. ఆమె అతనితో, ''హసన్, తల్లి తన బిడ్డ కోసం చెయ్యదగినదంతా నేను నీ కోసం చేస్తాను. నీ భార్య ఈ యోధకన్యలలో ఒకతె అయి ఉంటుంది. రేపు స్నానాలకు ఇక్కడికి వచ్చినప్పుడు నీవు వారందరినీ చూసి వారిలో నీ భార్యను గుర్తుపట్టగలిగితే నీ పని తేలిక అవుతుంది,'' అన్నది.

ఆమె అన్నట్టే, మర్నాడు యోధకన్యలు సముద్రంలో స్నానం చెయ్యటానికి కవచాలూ, శిరస్త్రాణాలూ లేకుండా వచ్చినప్పుడు, మారు వేషంలో ఉన్న హసన్ వారినందరినీ చూశాడు. కాని, వారిలో అతని భార్య లేదు.

అందరూ స్నానాలు చేసే సమయంలో హసన్ ముసలిదానికి ఈ మాట చెప్పగానే ఆమె కంగారుపడి, ''అయ్యో, హసన్, ఇంక మిగిలినది మా చక్రవర్తి గారి ఏడుగురు కూతుళ్ళు మాత్రమే. వారిలో ఒకతె నీ భార్య అయిన పక్షంలో నీవూ, నేనూ కూడా హతాశులమే. నువు వెతికేది నీ భార్యను కాదు, నాయనా, మృత్యువును! ఈ ప్రయత్నం ఇంక మాని నీ ఆశ నిరాశ చేసుకో!'' అన్నది.

''అమ్మా, ఇంతదూరం వచ్చి ఇప్పుడు వెనక్కు మళ్ళనా? నీ సహాయం మీద ఎంతో ఆధారపడ్డాను. ఇప్పుడు నేను అపజయం శంకించానంటే అది నీ శక్తి సామర్థ్యాలను శంకించటమే గదా! ఈ ఏడు దీవులూ నీ రక్షణలో ఉండగా నీకు అసాధ్యమంటూ ఉంటుందా?'' అన్నాడు హసన్.

''నాకున్న అధికారం ఈ దీవులను కాపాడే యోధకన్యల పైన. వారిలో నీ యిష్టం వచ్చినదాన్ని కోరుకో, ఇచ్చేస్తాను. ఆమెను తీసుకుపోయి సుఖంగా ఉండు. కాదన్నావో మన యిద్దరికీ విపత్తుతప్పదు!'' అన్నది ముసలిది. —(ఇంకా వుంది)





# గంధర్వ చక్రవర్తి కూతురు

## 9

యోధకన్యల అధికారి అయిన ముసలి దాని మాటలు విని, హసన్ ఘోరున ఏడవ సాగాడు. అతని దుఃఖం చూసి కలవర పడి ఆమె, "నన్నేం చెయ్యమంటావో చెప్పు. నిన్ను ఈ దీవి మీదికి రానిచ్చి నందుకే నా పీక తెగిపోతుంది. పోనీ నీకు భార్య కాకపోతే అంతులేని ధనం ఇస్తాను పట్టుకు పో. దానితో బతికున్నంత కాలమూ చక్రవర్తిలాగా భోగాలు అనుభ వించు," అన్నది.

హసన్ ఆమె కాళ్ళు పట్టుకుని, "నా ప్రయత్నం ఫలించి తీరాలి. విధి నాకు అనుకూలంగా ఉండబట్టే ఇన్ని అపదలు గడిచి ఇంతదాకా రాగలిగాను. ఈ దశలో ఈ ప్రయత్నం విరమించను," అన్నాడు.

హసన్ పట్టు మంకుపట్టని ముసలిది గ్రహించింది. "అయేదేదో అవుతుంది. నీతోపాటు అవసరమైతే నేనూ నాశనమై పోతాను. అంతకన్న గత్యంతరం లేదు. వాక్-వాక్ దీవులు ఏడూ, చక్రవర్తి కుమార్తెలు ఏడుగురి అధీనంలోనూ ఉన్నాయి. ఇది పెద్ద కుమార్తె దీవి. ఆమె పేరు నూరల్ హుదా. నీ సంగతంతా ఆమెకు చెప్పి ఎలాగైనా ఆమెను నీపట్ల సుముఖురాలిని చేసి ఇప్పుడే వస్తాను," అని ముసలిది వెళ్ళిపోయింది.

నూరల్ హుదా ముసలిదాన్ని చూస్తూనే మర్యాదగా లేచి, ఆమెకు ఆసనం చూపించి కూచోమని, "ఏమైనా మంచి వార్త తెచ్చావా? లేక ఏదైనా కోరటానికి వచ్చావా? అడుగు, ఇచ్చేస్తాను," అన్నది.

"మహారాణీ, నా చిట్టితల్లీ! ఇవాళ ఒక వింత జరిగింది. అది వింటే నువ్వు పగలబడి నవ్వుతావు. ఒక యువకుడు



ఎలా వచ్చాడో మన తీరాన వచ్చి పడ్డాడు. అతను ఏడుస్తూ నా కంట పడేసరికి అతని విషయం అడిగాను. విధి తనను ఇక్కడికి ఈడ్చుకువచ్చిందనీ, తాను తన భార్యను వెతుకుతున్నాననీ చెప్పాడు. అతను తన భార్యను వర్ణించాడు- ఆ వర్ణన చూస్తే నీవో, నీ చెల్లెళ్ళలో ఒకరో అయి ఉండా లనిపించింది. అతను కూడా, మానవుడే అయినప్పటికీ, అసాధారణ సౌందర్య వంతుడు," అన్నది ముసలిది.

నూరల్ హుదా చప్పున మండిపడి, "ముసలిపీనుగా, పాపిష్ఠిదానా! మన ద్వీపం మీదికి మగవాణ్ణి ఎలా రానిచ్చావు? నీ రక్తం తాగి నీ కండలు పీక్కు తింటాను! నీ పీక నులిమేసే ముందు ఆ మనిషిని ఒకసారి చూస్తాను, వాణ్ణి పట్టుకు రా! వాడు మన దీవిపై అడుగు పెట్టి దాన్ని అపవిత్రం చేశాడు," అన్నది.

"ఈ అబ్బి నా ప్రాణం మీదికి తెచ్చాడు," అని ముసలిది గొణుగుతూ, భయంతో తత్తరపడిపోతూ హసన్ వద్దకు వెళ్ళి, "జీవచ్ఛవమా, బయలుదేరి రా! నిన్ను మా రాణిగారు చూస్తారట!" అన్నది. "నాకేం మూడనున్నది?" అనుకుంటూ హసన్ ఆమె వెంట బయలుదేరాడు.

వారు వచ్చేసరికి నూరల్ హుదా మేలి ముసుగు ధరించి ఉన్నది. హసన్ ఆమెకు ప్రణామాలు చేసి, ఆమెపైన పద్యాలు కూడా చదివాడు. చక్రవర్తి కూతురు అంతా విని, ప్రశ్నించమన్నట్టుగా ముసలి దానికి సైగ చేసింది. ముసలిది హసన్ కేసి తిరిగి, "మహారాణివారు అడుగు తున్నారు. నీ పేరూ, నీ భార్య పేరూ, నీ పిల్లల పేర్లూ చెప్పు," అన్నది.

హసన్ చక్రవర్తి కూతురి కేసి తిరిగి, "మహారాణీ, నేను హసన్ అనే దౌర్భాగ్యుణ్ణి. నాది ఇరాక్ దేశంలో బస్రా నగరం. నా భార్య పేరు నాకు తెలియదు. నా కొడుకులకు నాసిర్, మన్సూర్ అని పేర్లు పెట్టుకున్నాం," అన్నాడు.



నీ భార్య నిన్ను ఎందుకు వదిలిపోయిందని అడిగితే హసన్ తనకు తెలియదన్నాడు; కాని ఆమె మనస్ఫూర్తిగా తనను వదిలి ఉండదన్నాడు. ఆమె బయలుదేరింది బాగ్దాదులోని ఖలీఫా భవనం నుంచి అనీ, ఎగిరిపోవటానికిగాను ఆమె పక్షి ఉడుపు ఉపయోగించిందనీ, వెళ్ళిపోయేటప్పుడామె తన తల్లితో తాను వాక్-వాక్ దీవులలో ఉంటానని చెప్పిందని కూడా హసన్ చెప్పేశాడు.

అంతదాకా మౌనంగా ఉన్న నూరల్ హుదా, "నీ భార్యకు నీపై ప్రేమ లేకపోతే తానుండేచోటు చెప్పి ఉండదు; నీపైన ప్రేమ ఉంటే నిన్ను విడిచి వెళ్ళిపోయి ఉండదు," అన్నది.

తన భార్య తనను గాఢంగా ప్రేమించినట్టు లక్ష నిదర్శనాలున్నాయనీ, ఎగరాలన్న కోరికచేత వివశురాలై ఆమె వెళ్ళిపోయిందనీ హసన్ చెప్పాడు.

ముసలిది కూడా ధైర్యం తెచ్చుకుని చక్రవర్తి కూతురి కాళ్ళపై పడి, "మహారాణీ, నిన్ను పెంచి పెద్దదాన్ని చేసిన నా మొర ఆలకించు. ఈ అభాగ్యుణ్ణి శిక్షించకు. ఇతను ఇన్ని కష్టాలూ గడిచి దేవుడి దయచేతనే ఇక్కడికి చేరాడు. మనం ఇతన్ని అతిథిగా చూడటం భావ్యం. ఇతను చేసిన తప్పులు భార్యపై గల ప్రేమతో చేసినవి; వాటిని క్షమించవచ్చు. అదంతా అలా ఉంచి ఇతను చక్కని ఆశుకవిత్వం చెబుతాడు. ఒకసారి మేలిముసుగు తొలగించి నీ ముఖం చూపించావంటే అద్భుతమైన పద్యాలు అల్లుతాడు," అన్నది.

హసన్ ఎలాటి కవిత్వం చెబుతాడోనని నూరల్ హుదా కుతూహలపడి తన ముఖానికి ఉన్న మేలిముసుగు తొలగించింది. హసన్ ఆమె ముఖం చూస్తూనే కెవ్వన కేక పెట్టి మూర్ఛపోయాడు.

చక్రవర్తి కుమార్తెను చూస్తూనే మూర్ఛపోయిన హసన్‌ను వృద్ధయోధకన్య సేదదేర్చి, అతని వికారానికి కారణ



మడిగింది. "ఈమె ముమ్మూర్తులా నా భార్యే కాని, నా భార్య మాత్రం కాదు!" అన్నాడు హసన్ ఆవేదనతో.

ఈ మాటకు చక్రవర్తి కూతురు పగలబడి నవ్వి, "ఈ మనిషికి నిశ్చయంగా పిచ్చే! ఏమోయ్? నీ మాటలను బట్టి చూస్తే నీ భార్యకూ నాకూ చాలా పోలికలున్నట్టున్నది. కొంత తేడా కూడా ఉన్నట్టున్నది. పోలికలేవి? తేడా ఎందులో?" అని అడిగింది.

"మహారాణీ, మీకూ నా భార్యకూ ఏ అవయవంలోనూ తేడా లేదు. కాని మీ ఇద్దరికీ తేడా ఉన్నది. దాన్ని నేను గ్రహించగలను గాని వివరించలేను," అన్నాడు హసన్. ఈ మాటతో చక్రవర్తి కుమార్తెకు రెండు విషయాలు స్పష్టంగా తెలిసిపోయాయి—ఈ అందగాడి మనసు తన కేసి రాదు; ఇతని భార్య తన ఆరుగురు చెల్లెళ్ళలోనూ ఒకతె అయి ఉండాలి. ఆమెకు హసన్ పైనా, అతని ప్రేమకు పాత్రురాలైన తన చెల్లెలి పైనా పట్టరాని ఈర్ష్యా, కోపమూ పుట్టుకొచ్చాయి. తన చెల్లెళ్ళలో ఇతని భార్య ఎవరో తెల్సుకుని, దాన్నీ ఇతన్నీ కూడా క్రూరంగా శిక్షించటానికి ఆమె నిశ్చయించుకున్నది.

ఆమె ముసలిదాని కేసి తిరిగి, "ఓసీ, నీవు ఇక్కడున్నట్టుగా మిగిలిన ఆరు దీవులకూ వెళ్ళి, నా ఆరుగురు చెల్లెళ్ళనూ పిలుచుకురా. వాళ్ళను చూడగోరుతున్నానని చెప్పు. చెప్పి నీ వెంట తీసుకురా. ఈ యువకుడి సంగతి ఏమీ చెప్పకు సుమా!" అన్నది.

ముసలిదానికి తన యజమానురాలి ఎత్తు అర్థం కాలేదు. అందుచేత ఆమె అతి శీఘ్రంగా ఒక్కొక్క దీవికే వెళ్ళి, ఒక్కొక్క చక్రవర్తి కుమార్తెనూ వెంట తీసుకుని, చక్రవర్తి ఆఖరు కుమార్తె వద్దకు వచ్చింది. హసన్ భార్య ఈ కుమార్తే. ఈమె పైన గల మమకారంతో గంధర్వ చక్రవర్తి ఈమె దగ్గిరే ఉంటున్నాడు.

తన కడగొట్టు కూతురు వెళ్ళిపోవటానికి ఆయన అభ్యంతరం చెప్పాడు. తనకేవో దుశ్శకునాలు కనిపించాయని చెప్పి ఆయన తన చిన్న కుమార్తెను వెళ్ళవద్దన్నాడు.

"నా కోసం మా అక్క నూరల్ హుదా విందు సిద్ధం చేసి పిలిపిస్తే వెళ్ళకుండా ఎలా, నాన్నా? నే నామెను చూడబోయి రెండేళ్ళయింది. ఇప్పుడు కూడా రానంటే ఆమెకు కోపం వస్తుంది. నా కేమీ భయం లేదు. ఒకప్పుడు నేను చాలా కాలం కనిపించకపోతే ఏమయానో అని నీవు దిగులుపడ్డావు. అయినా నేను తిరిగి వచ్చానుకానా? ఈ సారి దూరం వెళ్ళటంలేదాయె, మన దీవులలోనేకద!" అన్నది హసన్ భార్య తన తండ్రితో.

ఆమె తన అక్క వద్ద కొద్ది రోజులు మాత్రమే ఉండి తిరిగివచ్చే షరతు మీద తండ్రి ఆమె వెళ్లటానికి అనుమతించాడు. మునలిది ఆరుగురు అప్పచెల్లెళ్ళనూ వెంటపెట్టుకుని నూరల్ హుదా వద్దకు బయలుదేరింది. తన చెల్లెళ్ళు వచ్చే లోపుగా నూరల్ హుదా ప్రత్యేకమైన దుస్తులూ నగలూ ధరించి, మెరిసిపోతూ సింహాసనం పైన ఠీవిగా కూచున్నది. ఆమె కెదురుగా హసన్ దీనవదనంతో నిలబడి ఉన్నాడు. అతన్ని యోధకన్యలు విచ్చు కత్తులతో కాస్తున్నారు.

మునలిది వచ్చి తన చెల్లెళ్ళు వచ్చారని చెప్పగానే ఆమె ఒక్కొక్కరినిగా తన వద్దకు పంపమని ఉత్తరువిచ్చింది. పెద్ద చెల్లెలు వచ్చింది. నూరల్ హుదా ఆమెను పలకరించి తన సరసను కూచోబెట్టుకుని, హసన్‌ను సంబోధిస్తూ, "మానవుడా, ఈమె నీ భార్య అవుతుందా?" అని అడిగింది.

"ఈమె సౌందర్యం సాటిలేనిది, వర్ణనాతీతం. అయినప్పటికీ ఈమెకూ, నా భార్యకూ వ్యత్యాసం ఉన్నది. దానిని నేను మాటలతో వివరించి చెప్పలేను," అన్నాడు హసన్.

—(వచ్చే సంచికలో ముగింపు)






## 10

నూరల్ హుదా ఇదే విధంగా తన చెల్లెళ్ళను ఒకరొకరినే లోపలికి రప్పించి, హసన్‌కు చూపి, "నీ భార్య ఈమేనా?" అని అడిగింది. అయిదుగురయారు. అందరిని గురించీ హసన్ మొదట చెప్పి నట్టే చెప్పాడు. ఇంక హసన్ భార్య మాత్రమే మిగిలి ఉన్నది. ఆమెను ప్రవేశ పెట్టమని నూరల్‌హుదా ముసలిదానికి ఉత్తరువిచ్చింది. గంధర్వచక్రవర్తి కడ గొట్టు కుమార్తె లోపలికి వచ్చింది. ఆమెను చూస్తూనే హసన్ కెవ్వున అరిచి విరుచుకు పడిపోయాడు. ఆమె కూడా అతన్ని గుర్తించి తన అక్క కూచుని ఉన్న సింహాసనం చెంత మూర్ఛపడిపోయింది.

నూరల్‌హుదా ఇక తన ఈర్ష్యను అణచుకోలేక, "ఆ మనిషిని పట్టుకు పోయి నగరం వెలపల పారెయ్యండి!" అని ఆడభటులను ఆజ్ఞాపించింది. వారు హసన్‌ను సముద్రతీరాన పారేశారు.

హసన్ భార్యకు స్పృహ రాగానే నూరల్‌హుదా ఆమెతో, "సిగ్గు మాలిన దానా! పాపాత్మురాలా! ఆ మనిషికీ, నీకూ ఏమిటి సంబంధం? నాన్నకు తెలియకుండా వాడికి భార్యవై, తరవాత వాణ్ణి విడిచిపెట్టి వచ్చి, రెండందాలా పతితవైనావు. నీ వంశానికి నీవు తెచ్చిన మచ్చను నీ రక్తంతోనే కడిగెయ్యాలి." అని దాసీలను, "ఈ పాపాత్మురాలిని గుంజకు కట్టేసి, నెత్తురు వరదలై పారే దాకా కొట్టండి!" అని ఆజ్ఞాపించింది. ఆ తరవాత ఆమె తన తండ్రికి ఒక లేఖ రాసింది. అందులో తన అఖరు చెల్లెలి కథ అంతా వివరించి, తాను ఆమెకు ఇవ్వబోయే శిక్ష తెలిపి, ఆయన అనుమతి



శీఘ్రంగా కావాలని కోరింది. ఆ లేఖను ఒక దూత ద్వారా తండ్రికి పంపింది.

ఆ లేఖ చూడగానే చక్రవర్తి కళ్ళకు చీకట్లు కమ్మాయి. కాని ఆయన దానికి జవాబిస్తూ, "నీ చెల్లెలు చేసిన పాపానికి తగిన శిక్ష అంటూ లేదు. ఆమె ప్రాణ దండన ఎలా విధిస్తావో నీవే నిర్ణయించి, అమలు చెయ్యి." అని చెప్పాడు.

హసన్‌కు స్పృహ తెలిసేసరికి అతను సముద్ర తీరాన ఉన్నాడు. అతని కిప్పుడే ఆశా లేదు. అతను వెర్రివాడిలాగా లేచి దిక్కు లేకుండా నడవసాగాడు.

అతనలా నడిచి వెళుతుంటే ఒక చోట ఇద్దరు ఆడపిల్లలు, పన్నెండేళ్ళ వయసు వాళ్ళు ఒక కుళాయి కోసం పెనగులాడుతూ కనిపించారు. అది తోలుతో చేసినది. దాని మీద ఏవో అక్షరాలూ, అలంకారాలూ ఉన్నాయి. అతను ఆ పిల్లలను, "ఎందుకు కీచులాడుకుంటున్నారు?" అని అడిగాడు.

ఆ కుళాయి కోసం వాళ్ళు పోట్లాడుకుంటున్నారు. నాకు దొరికిందంటే, నాకు దొరికిందంటున్నారు. "మీ తగాదా నేను తీరుస్తాను. నేనొక రాయి విసురుతాను. మీలో ఎవరు ముందు పరిగెత్తి వెళ్ళి ఆ రాయిని తీసుకొస్తే వాళ్ళది కుళాయి! సరేనా?" అన్నాడు హసన్.

హసన్ ఒక రాయి బలం కొద్దీ విసిరాడు. పిల్లలిద్దరూ దానికోసం పరిగెత్తారు. వాళ్ళు తిరిగి వచ్చేదాకా టోపీ తన నెత్తిన పెట్టుకుని హసన్ అక్కడే నిలబడ్డాడు. త్వరలోనే ఇద్దరు పిల్లలూ తిరిగి వచ్చారు. ఒకతె చేతిలో రాయి ఉన్నది. "ఇదుగో, నేను గెలిచాను. నువ్వెక్కడున్నావు?" అన్నదా పిల్ల. ఇద్దరూ తన కోసం దిక్కులు చూస్తూండటం గమనించి హసన్ ఆశ్చర్య పోయాడు. "వాళ్ళు గుడ్డివాళ్లు కారే, ఎందుకలా దిక్కులు చూస్తారు? నేనిక్కడే ఉంటినిగా?" అనుకున్నాడు. "నేనిక్కడే ఉన్నాను!" అని వాళ్ళను కేక పెట్టాడు.

కేక వచ్చిన దిక్కుగా చూశారు పిల్లలు. కాని వాళ్లకేమీ కనిపించక పోయేసరికి భయపడి సన్నగా ఏడుపు సాగించారు. హసన్ వాళ్ళను తాకి, "ఎందుకర్రా ఏడుస్తారూ?" అన్నాడు. దాంతో వాళ్లకు మరింత భయం కలిగి కాలినత్తువ కొద్దీ పారిపోయారు.

"అరె, ఇది మంత్రపు కుళాయిలా గుంది. ఇది నెత్తిన పెట్టుకుంటే అదృశ్య మవుతారు కాబోలు!" అనుకున్నాడు హసన్. ఇప్పుడు తాను రహస్యంగా వెళ్ళి తన భార్యను చూడవచ్చు. అతనికి నృత్యం చెయ్యాలన్నంత ఆనందం కలిగింది. అతను వెంటనే బయలుదేరి నగరానికి వెళ్ళి ముసలిదాని కోసం వెతి కాడు. ఆమె ఒక గదిలో కట్టి పడేసి ఉన్నది. తాను అదృశ్యంగా ఉన్నదీ లేనిదీ రూఢిగా తెలుసుకోవటానికి అతను ఆ గదిలో ఒక పక్కన పేర్చి ఉన్న పింగాణీ జాడీలలో ఒకటి ఎత్తి నేలకు గట్టిగా విసిరి పెద్ద చప్పుడయేలాగా పగల గొట్టాడు. ముసలిది అటూ ఇటూ చూసి, ఎవరూ కనపడక, "ఓ భూతమా, ఎవరు నీవు?" అని కేకపెట్టింది భయంతో.

"నేను భూతాన్ని కాదు, హసన్‌ను, నిన్ను విడిపించటానికి వచ్చాను," అంటూ హసన్ నెత్తిమీది నుంచి కుళాయి తీశాడు.



"అయ్యో, హసన్! నీ వెంత దౌర్భా గ్యుడివి! మా రాణి నిన్ను ప్రాణాలతో వదిలినందుకు పశ్చాత్తాప పడి, నిన్ను పట్టుకురమ్మని భటులను పంపింది. అందుచేత నీవు ఇక్కడ తారట్లాడక సాధ్య మైనంత వేగంగా పారిపో." అన్నది ముసలిది. ఆమె అతనితో అతని భార్యకు జరగబోయే శిక్షను గురించి కూడా చెప్పింది.

"నన్నూ, నా భార్యనూ, నిన్నూ కూడా దేవుడే కాపాడతాడు. ఈ కుళాయి చూడు. ఇది మంత్రశక్తి కలది. దీన్ని నెత్తిన పెట్టుకుని ఎక్కడికైనా పోగలను. నన్నెవరూ చూడలేరు." అన్నాడు హసన్.



63



ముసలిది ఈ మాట విని పరమానందం చెంది, "అయితే నన్ను విడిపించు. నీ భార్యను బంధించిన చోటు చూపుతాను," అన్నది. హసన్ ఆమె కట్లు విప్పి, తన నెత్తిన కుళాయి పెట్టుకుని ముసలిదాని చెయ్యి పట్టుకున్నాడు. వెంటనే ఆమె కూడా అతనితోబాటు అదృశ్యమయింది.

ముసలిది అతన్ని ఒక చీకటి కొట్టు వద్దకు తీసుకుపోయింది. హసన్ భార్య అందులోనే బంధించి ఉన్నది. ఆమె చిత్రహింస అనుభవించటానికి ఎదురు చూస్తూ అతి దీనస్థితిలో ఉన్నది. అతను ఒక్కసారిగా తన భార్య ఎదటపడి ఆమెను కంగారు పెట్టకూడదని అనుకుని కూడా ఆమె దైన్యాన్ని చూసి సహించలేక, తన నెత్తిమీది కుళాయి తీసేసి ఆమెను ఆలింగనం చేసుకున్నాడు. ఆమె తన భర్తను చూస్తూనే మూర్ఛపోయింది.

హసన్ ఆమె బంధాలు తెంచి, ముసలిదాని సహాయంతో ఆమెకు మూర్ఛ తెలిసేటట్టు ఉపచారాలు చేశాడు. ఆమె మెల్లిగా కళ్లుతెరిచి, "నీవు ఆకాశంనుంచి దిగావో, భూమిలో నుంచి పైకి వచ్చావో నాకు తెలీదు. నా కర్మకు నన్ను విడిచి త్వరగా వెళ్ళిపో. విధిని ఎవరు తప్పించగలరు? నా అక్క నన్ను చిత్రవధ చేయిస్తుంటే నీవు చూడలేవు," అన్నది.

"పిచ్చిదానా, నిన్ను బాగ్దాదుకు తీసుకుపోవటానికి వచ్చాను," అన్నాడు హసన్.

ఆమె నమ్మక, "నీకు పిచ్చిలో కూడా సాహసం పోలేదు," అన్నది.

"నిన్నూ, ఈ ముసలిదాన్నీ వెంట తీసుకోకుండా నే నీ భవనం నుంచిపోను. ఈ కుళాయి చూడు," అంటూ దాని ప్రభావం తన భార్యకు ప్రదర్శించి చూపాడు హసన్.

హసన్ భార్య ఆనందంతోనూ, పశ్చాత్తాపంతోనూ కన్నీరు కారుస్తూ, "నీ కష్టాలన్నిటికీ మూలం, నేను బాగ్దాదు నుంచి వచ్చెయ్యటమే. నేను చేసిన పాప

పని ఏమిటో నాకు తెలుసు. కనక, నన్ను పనిపెట్టుకుని నిందించవద్దు," అన్నది.

"కాదు, నిన్ను నా వెంట తీసుకుపోకుండా బాగ్దాదులో విడిచి వెళ్ళటమే నా తప్పు, ఇక ఎన్నటికీ అలాటి పని చెయ్యను," అన్నాడు హసన్.

అతను కుళాయి నెత్తిన పెట్టుకుని ఒకచేత భార్యనూ, రెండవచేత ముసలిదాన్ని పట్టుకునేసరికి ముగ్గురూ అదృశ్యులయారు. ఆ స్థితిలో వారు రాజభవనం నుంచి ఎవరికీ కాన రాకుండా బయటపడి, హసన్ భార్య తన బిడ్డలను రహస్యంగా దాచి ఉంచిన చోటికి వెళ్లారు. నాసిర్‌నూ, మన్సూర్‌నూ చూడగానే హసన్ తండ్రి హృదయం పొంగిపొర్లింది.

ముసలిది బిడ్డలిద్దరినీ తన భుజాలపైన ఎక్కించుకున్నది. తరవాత హసన్ భార్య అదృశ్యంగా వెళ్ళి మూడు పక్షి తొడుగులు దొంగిలించి తెచ్చింది. పెద్దవాళ్ళు ముగ్గురూ వాటిని ధరించి, భయంకరమైన వాక్-వాక్ దీవుల నుంచి శాశ్వతంగా ఎగిరిపోయారు.

వారు ఏకంగా బాగ్దాదులో హసన్ ఇంటి డాబాపై వాలి, మెట్ల మీదుగా కిందికి దిగి హసన్ తల్లి ఉన్న చోటికి వచ్చారు. ఆమె అసలే వృద్ధురాలు. ఏడిచి ఏడిచి ఆమెకు దృష్టి కూడా సరిగా లేకుండా పోయింది. దిక్కులేని ఆ వృద్ధురాలు అవసానదశలో ఉన్నది. హసన్ ఆమె గది తలుపు తట్టి, "అమ్మా, తలుపు తియ్యి! శుభవార్త!" అనగానే ఆమె ఒక్క పరుగున వచ్చి తలుపు తీసి, తన కొడుకునూ, కోడలినీ, మనమలనూ, ముసలిదాన్నీ చూసి, ఆనందోద్రేకం పట్టలేక మూర్ఛపోయింది.

హసన్ తన తల్లికి ఉపచారాలు చేసి స్పృహ తెప్పించాడు. అతని భార్య ఆమెకు తన తప్పుకు క్షమాపణ చెప్పుకున్నది. జరిగిన విచిత్ర సంఘటనలన్నీ హసన్ తల్లికి చెప్పాడు. తరవాత అందరూ సుఖంగా ఉన్నారు. —(అయిపోయింది)

